“శ్రీరస”

# శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య

## బెంగుళూరు



## రజత మహోత్సవ ప్రత్యేక సంచిక

**(1994-2019)**

స్థాపన : భావనామ సంవత్సర ఉగాది 11-04-1994

# "శ్రీరస"

# శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య

బెంగుళూరు

# వెండి పండుగ




## రజత మహోత్సవ ప్రత్యేక సంచిక


సంపాదకులు

**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**



*ప్రచురణ*

**శ్రీరస ట్రస్టు (రి.)**

**2020**

SRIKRISHNADEVARAYA RASAJNA SAMAKHYA (“SRIRASA”), Silver Jubilee (1994-2019) Special Souvenir in Telugu edited by Prof. T.V. Subba Rao, and Published by “SRIRASA TRUST” (Reg.) in March 2020.

**No. of Pages: 104**

**Price:** Rs.100/-

**No. of Copies:** 300

**First Edition : 25-03-2020** (శార్వరినామ సంవత్సర ఉగాది)



ముఖచిత్రం : తిరుమల శ్రీవారిగుడిలో రాయలు స్వయంగా ప్రతిష్ఠించుకున్న పంచలోహవిగ్రహాలు
చిన్నాదేవి–శ్రీకృష్ణదేవరాయలు–తిరుమలదేవి

**For Copies:**

1) **Prof. T.V. Subbarao**
Founder President, “SRIRASA”
#1708, *“Siitaavadhaanam”*
11th Cross; 1st “G” Main
Kengeri Satellite Town
BENGALURU – 560 060
Mobile: 99454 22742

2) **Sri P.V. Radhakrishna**
Secretary, “SRIRASA”
# 57, “Brahmagiri”, 6th Cross;
Central Excise Layout, RMV– 2nd Phase
BENGALURU – 560 094
Mobile: 97400 68936

**DTP: Nagasri Graphics**
H.No.1-18, Plot No.17
Brindavana Colony
Near Agnimaremma Temple
Gundlasagaram Village - 517 425
Gudupalli Mandal; Chittoor District
Mobile: 8500619283; Andhra Pradesh

*Printing :*
**OMKAR Offset Printers**
3/3, 1st Main Road, New Tharagupet
(Near Minto Eye Hospital)
Bengaluru – 560 002
Ph.No.080-26708186/7; Mobile: 9844012897



**శ్రీ కృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!**
**లోకద్రోహినరేంద్రవంశ దహనా! లోకేశ్వరా! దేవతా**
**నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా! నిర్వాణసంధాయకా!**
**నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!**

**(–బమ్మెర పోతన భాగవతము)**

## అంకితం

గత 25 సంవత్సరాలుగా "శ్రీరస"కు చేయూత నిస్తున్న

పోషక సభ్యులకు –

వార్షిక సభ్యులకు –

"శ్రీరస" కార్యనిర్వాహకవర్గ సభ్యులకు –

"శ్రీరస ట్రస్టుబోర్డు" సభ్యులకు –

మహారాజ పోషకులకు –

రాజపోషకులకు –

పోషకులకు –

వక్తలకు –

శ్రోతలకు –

**– తంగిరాల వెంకట సుబ్బారావు**

"శ్రీరస" వ్యవస్థాపక అధ్యక్షులు

# విషయ సూచిక


1. మా తెలుగుతల్లికి మల్లెపూదండ!
   - శంకరంబాడి సుందరాచారి 5
2. చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా!
   - వేములపల్లి శ్రీకృష్ణ 6
3. ప్రియభారత జనయిత్రీ!
   - దేవులపల్లి కృష్ణశాస్త్రి 7
4. ఏ దేశమేగినా, ఎందు కాలిడిన..
   - రాయప్రోలు సుబ్బారావు 8
5. దేశమును ప్రేమించుమన్నా!
   - గురజాడ అప్పారావు 9
6. "శ్రీరస" - శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య (రి.)
   - ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు 10
7. శ్రీ ఆండాళ్ళు తిరుప్పావు
   - దేవులపల్లి కృష్ణశాస్త్రి 14
8. శ్రీకృష్ణదేవరాయలు - అష్టదిగ్గజకవులు
   - ఆచార్య దివాకర్ల వేంకటావధాని 26
9. వాలివధ - వాల్మీకి తీర్పు
   - డా॥ చన్నాప్రగడ తిరుపతిరావు 34
10. మహాభారతము - కర్ణుడు
    - డా॥ అప్పజోడు వేంకట సుబ్బయ్య 40
11. ఏకలవ్యుని వృత్తాంతము
    - ఆచార్య లింగమనేని బసవ శంకరరావు 54

**అనుబంధం**

1. శ్రీకృష్ణదేవరాయలవారి వర్ణచిత్రం-ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు 58
2. అనన్య 'శ్రీరస' - ఆత్మీయత - డా॥ దివాకర్ల రాజేశ్వరి 61
3. అరవైవసంతాల కవితావాణి - ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు 64
4. కవితానీరాజనం - వివిధ కవులు 69
5. హాస్యజ్యోతి - శ్రీరమణ 71

ఛాయా చిత్రాలు 73

ప్రకటనలు 101

# మా తెలుగుతల్లికి మల్లెపూదండ!

మా తెలుగుతల్లికీ మల్లెపూదండ
మా కన్నతల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మాతల్లి ॥మా తెలుగు॥

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి ॥మా తెలుగు॥

అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలచియుండేదాక ॥మా తెలుగు॥

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయని కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం – నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!!

**– శంకరంబాడి సుందరాచారి**

# చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా!

చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి గలవోడా!

సాటిలేనీ జాతి – ఓటమెరుగని కోట
నివురుగప్పీ నేడు – నిదురపోతుండాది
జైకొట్టి మేల్కొలుపు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి గలవోడా!

వీరరక్తపు ధార – వారబోసిన సీమ
పలనాడు నీదెరా – వెలనాడు నీదెరా
బాలచంద్రుడు చూడ ఎవరోడు?
తాండ్రపాపయ కూడ నీవోడూ!

నాయకీ నాగమ్మ – మల్లమాంబ, మొల్ల
మగువ మాంచాల నీ తోడబుట్టిన వోళ్ళె
వీరవనితల గన్న తల్లేరా!
ధీరమాతల జన్మభూమేరా!

గతములో నీకీర్తి – కతలల్లి సెప్పారు
పసయేడ దాచావు – పుసిలేకపోయెరా
బ్రతుకె బరువైయుంటి వీనాడు!
శతపోరి సాధించు తొలిపేరు!

నాగార్జునుడి కొండ – అమరావతీ స్తూప
భావాల పుట్టలో – జీవకళ పొదిగావు
అల్పుడను కానంచు తెల్పావు!
శిల్పినంటివి దేశదేశాల!

రాజ్యమంటే వీరభోజ్యమన్నాడు మన
తిక్కనార్యుని మాట – ధీరులకు బాటరా
పూర్వ పౌరుష మెరిగి బ్రతకాలి!
కార్యశూరులు నేడు కావాలోయ్!

దేశమంటే వట్టి మట్టి కాదన్నాడు
మనుషులన్నామాట మరవబోకన్నాడు
అమరకవి గురజాడ నీవోడు –
ప్రజల కవితను పాడి చూపాడోయ్!

రాయలేలిన సీమ – రతనాల సీమరా
దాయగట్టే పరులు – దారితీస్తుండారు
నోరెత్తి యడుగరా దానోడా
వారసుడ నీవెరా తెలుగోడా!

కల్లోల గౌతమీ – వెల్లువల కృష్ణమ్మ
తుంగభద్రా తల్లి – పొంగిపారిన చాలు
ధాన్యరాసులె పండు దేశాన
కూడుగుడ్డకు కొదువలేదోయి!

పసిడి పాతర నీది – పరుల నోరూరెనోయ్
నీలో నీకే పెట్టి – నెత్తి చేయెట్టారు
దేశాన్ని దిగమింగి పోయినారోయ్!
మోసాన్ని గుర్తెరికి కాపాడోయ్!

ఉత్తరాదీ మొదలు – దత్తమండల మంత
తెలగాణ ప్రాంతముతొ – చెలిమి గలిగించాలి
కలిసి మెలసీ నేడు పోవాలోయ్!
కలిమి బలిమీ గూర్చుకోవాలి!

ముక్కోటి బలగమోయ్ – ఒక్కటై మనముంటె
యిరుగు పొరుగూ లోన – వూరు పేరుంటాది
తల్లి వొక్కతె నీకు తెలుగోడా!
సవతి బిడ్డల పోరు మనకేలా!

పెనుగాలి వీచింది – అణగారిపోయింది
నట్టనడి సంద్రాన – నావ నిలుచుండాది
చుక్కాని బట్టరా తెలుగోడా!
నావ దరిజేర్చరా మొనగాడా!

**– వేములపల్లి శ్రీకృష్ణ**

# ప్రియ భారత జనయిత్రీ!

జయ జయ జయ ప్రియ భారత
    జనయిత్రీ! దివ్య ధాత్రి!
జయ జయ జయ శతసహస్ర
    నరనారీ హృదయ నేత్రి!!    ॥జయ..జయ॥

జయ జయ సస్యామల, సు
    శ్యామ చలచ్చేలాంచల!
జయ వసంత కుసుమలతా
    చలిత లలిత చూర్ణకుంతల!
జయ మదీయ హృదయాశయ
    లాక్షారుణ పదయుగళా!!    ॥జయ..జయ॥

జయ దిశాంత గత శకుంత
    దివ్యగాన పరితోషణ!
జయ గాయక వైతాళిక
    గళ విశాల పద విహరణ!
జయ మదీయ మధురగేయ
    చుంబిత సుందర చరణ!!    ॥జయ..జయ॥

**– దేవులపల్లి కృష్ణశాస్త్రి**

# ఏ దేశమేగినా, ఎందు కాలిడిన...

ఏ దేశమేగినా, ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన,
పొగడరా నీ తల్లిభూమి భారతిని,
నిలుపరా నీజాతి నిండుగౌరవము.

ఏ పూర్వపుణ్యమో, ఏ యోగబలమొ
జనియించినాడ వీ స్వర్గఖండమున
ఏ మంచిపూవులన్ ప్రేమించినావొ
నిను మోచె ఈ తల్లి కనకగర్భమున.
లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరులింకెందు.

సూర్యుని వెలుతురుల్ సోకునందాక,
ఓడల జెండాలు ఆడునందాక,
అందాకగల ఈ అనంత భూతలిని
మన భూమివంటి చల్లనితల్లి లేదు
పాడరా నీ వీరభావ భారతము.

తమ తపస్సులు ఋషుల్ ధారవోయంగ
శౌర్యహారముల్ రాజచంద్రులర్పింప
భావసూత్రము కవిప్రభువు లల్లంగ
రాగదుగ్ధము భక్తరత్నముల్ పిదుక

దిక్కుల కెగదన్ను తేజమ్ము వెలుగ
రాళ్ళ తేనియలూరు రాగాలు సాగ
జగముల నూగించు మగతనం బెగయ
సౌందర్య మెగబోయు సాహిత్య మలర

వెలిగిన దీ దివ్యవిశ్వంబు పుత్ర!
దీవించె నీ దివ్యదేశంబు పుత్ర!
పొలముల రత్నాలు మొలిచెరా ఇచట
వార్ధిలో ముత్యాలు పండెరా ఇచట

పృథివి దివ్యౌషధుల్ పిదికెరా మనకు
కానల కస్తూరి కాచెరా మనకు.
అవమాన మేలరా? అనుమాన మేల?
భారతీయుడనంచు భక్తితో పాడ!

**– రాయప్రోలు సుబ్బారావు**

## మన ఇతిహాసాల ఊరేగింపు

1856లో వావిళ్ళవారు రామాయణ భారతాలను సంస్కరించి, తెలుగులో వెలువరించిన సందర్భంలో – మద్రాసు పౌరులు ఆ రెండు గ్రంథాలను ఒక పట్టపు ఏనుగు అంబారిపై ఉంచి, మంగళ వాద్యాలతో – పురప్రముఖులు వెంటరాగా మద్రాసు నగర ముఖ్యవీథులలో అత్యుత్సాహంతో ఊరేగించారు.

**(– శ్రీరమణగారి 'హాస్యజ్యోతి' నుండి)**

# దేశమును ప్రేమించుమన్నా!

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్!

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్
తిండి కలిగితె కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్!

ఈసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయ్!

అన్నిదేశాల్ క్రమ్మవలెనోయ్
దేశిసరుకుల నమ్మవలెనోయ్
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయ్!

వెనుక చూసిన కార్యమేమోయ్
మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుకపడితే వెనుకేనోయ్!

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్!

దేశాభిమానము నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్!

ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయ్
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయ్!

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపికెక్కడ సుఖం కద్దోయ్
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి!

సొంతలాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయ్!

చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయ్
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి!

మతం వేరైతేను యేమోయి
మనసు లొకటై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగీ
లోకమున రాణించునోయి!

దేశ మనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనంపంటలు పండవలెనోయి!

ఆకులందున అణగిమణగీ
కవితకోకిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయి!

**– గురజాడ అప్పారావు**

# "శ్రీరస"

## శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య (రి.)

### స్థాపన: భావనామ సంవత్సర ఉగాది: 11-04-1994

### రజతోత్సవం: వికారినామ సంవత్సర ఉగాది: 06-04-2019

**శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య ("శ్రీరస")-చరిత్ర:-**

భావనామ సంవత్సర ఉగాదినాడు - అంటే 11-4-1994 నాడు "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" ("శ్రీరస") అనే పేరుతో ఒక తెలుగు సాహిత్యసంస్థ స్థాపించబడింది. ఇది బెంగుళూరులోని మహాలక్ష్మీ లే అవుట్ లో డా॥ దివాకర్ల రాజేశ్వరిగారి (ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి అమ్మాయిగారి) ఇంట్లో ఒక కవితాగోష్ఠితో ప్రారంభమయింది. ప్రసిద్ధ తెలుగుకవి ''పతాభి''గారు, లబ్ధప్రతిష్ఠుడైన కన్నడ దళితకవి డా॥ సిద్ధలింగయ్యగారు ఈ ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు. ఈ సాహిత్యసంస్థ వ్యవస్థాపక అధ్యక్షులు ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు; వ్యవస్థాపక కార్యదర్శులు: డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు, శ్రీమతి అంబికా అనంత్‌గారు. వీరు ముగ్గురూ కలిసి, ప్రతినెలా మూడేసి ఉపన్యాసాలతో, ఒక సాహిత్యసభను నిర్వహిస్తూవచ్చారు. 2016లో "శ్రీరస" కార్యవర్గంలో మరికొందరు సభ్యులను చేర్చుకున్నాము. ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణకవిగారు, శ్రీ పి. కృష్ణంరాజుగారు ఉపాధ్యక్షులుగాను, శ్రీపి.వి. రాధాకృష్ణగారు ప్రధాన కార్యదర్శిగాను, శ్రీమతి మారుతి శ్రీలతగారు, డా॥ టి.ఆర్. మీనలోచనగారు అదనపు మహిళాకార్యదర్శులుగాను నియమింపబడ్డారు. ఈ "శ్రీరస"లో తెలుగు ప్రాచీన సాహిత్యంగురించి, ఆధునికసాహిత్యంగురించి, జానపద సాహిత్యంగురించి - ఎందరో కవులు, పండితులు ప్రసంగాలు చేశారు. 1994-2019 మధ్య ఈ సాహిత్యసంస్థలో సుమారు 600 ప్రసంగాలు, 60 గోష్ఠులు జరిగాయి. శేషేంద్ర, ఆవంత్స సోమసుందర్, ఇస్మాయిల్, ఆచార్య శలాక రఘునాథశర్మ, ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, డా॥ మైలవరపు శ్రీనివాసరావు, శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, శ్రీ వద్దిపర్తి పద్మాకర్, డా॥ గరికిపాటి నరసింహారావు, డా॥ ప్రసాదరాయకులపతి, శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్, ఆచార్య ఆర్వీయస్. సుందరం, డా॥ అద్దేపల్లి రామమోహనరావు, డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణ, ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య, శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు, ఆచార్య కె. మలయవాసిని, డా॥ బొడ్డుపల్లి గిరిజాలక్ష్మి, ప్రొ॥ సి. మృణాళిని, ప్రొ॥ కాత్యాయనీ విద్మహే, శ్రీ నగ్నముని, ప్రొ॥ ఎండ్లూరి సుధాకర్, ప్రొ॥ శిఖామణి, డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు, డా॥ మీగడ రామలింగస్వామి - మొదలైన ప్రముఖులు ''శ్రీరస''లో ఉపన్యసించి బెంగుళూరు తెలుగువారిని ఆనంద పరవశుల్ని చేశారు. రామాయణ సప్తాహం, మహాభారత సప్తాహం, భాగవత సప్తాహం, భువన విజయసభ, ఇంద్రసభ, మహాభారతంపై తీర్పు-ఇత్యాదులు అనేక పర్యాయాలు ''శ్రీరస'' నిర్వహించింది. "మధుర భారతి" బిరుదాంకితులు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తిగారు గత 18 సంవత్సరాలుగా (2001 నుండి) "శ్రీరస"లో ఇంచుమించు ప్రతినెలా మూడేసి ఉపన్యాసాలు చేస్తున్నారు. వీరు మహాభారతాన్ని గురించి 36 ఉపన్యాసాలు,

రామాయణాన్ని గురించి 27 ఉపన్యాసాలు, "సౌందర్య లహరి"ని గురించి 15 ఉపన్యాసాలు, "భగవద్గీత"ను గురించి 9 ఉపన్యాసాలు, "ప్రబంధ సుగంధం" అనే పేరుతో 20 ఉపన్యాసాలు చేసి, శ్రోతల హృదయాలను చూరగొన్నారు. "దానరాధేయ" శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు, శ్రీ తెలిదేవర సుబ్బారావుగారు, కీ.శే. శ్రీమతి ఎ. పాప – ప్రొ॥ డి.హెచ్. శాస్త్రి దంపతులు, శ్రీ నారపరాజు సూర్యనారాయణగారు, ప్రొ॥ జి. మోహన రావుగారు, డా॥ సి. సుబ్బలక్ష్మిగారు, శ్రీమతి చాగంటి కామేశ్వరి – శ్రీ కె.బి.జె. శ్రీనివాస్ దంపతులు, శ్రీమతి కె.ఎస్. మనోరమగారు, డా. బి.ఆర్. మృత్యుంజయ గారు, శ్రీమతి చక్రావధానుల పద్మ – శ్రీలంక చంద్రశేఖరం దంపతులు – మొదలైన వదాన్యులెందరో ఈ సాహిత్య సభలకు చేయూతనిస్తూవచ్చారు. "శ్రీరస" ఇప్పటికీ తెలుగు సాహిత్యసేవ చేస్తూనే ఉంది. ఈ వికారినామ సంవత్సరం ఉగాది నాటికి – అంటే 06–04–2019 నాటికి "శ్రీరస" స్థాపించి 25 సం.లు పూర్తి అయ్యాయి. అంటే 2019 "శ్రీరస రజతోత్సవ సంవత్సరం". ఇది మన అందరికి గర్వకారణం!

## "శ్రీరస" ట్రస్టు

"శ్రీరస" ఇకముందు కూడా నిర్విఘ్నంగా కొనసాగాలనే ఉద్దేశంతో, దీని శ్రేయోభిలాషులైన కొందరు మిత్రులు 19–11–2018నాడు ఈ సంస్థను "శ్రీరస ట్రస్టు" అనే పేరుతో రిజిస్టరు చేయించారు. ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు దీనికి వ్యవస్థాపక అధ్యక్షులుగాను, శ్రీ పి.వి. రాధాకృష్ణగారు కార్యదర్శిగాను, శ్రీ నారపరాజు సుబ్బారావుగారు కోశాధికారిగాను నియమితులయ్యారు. శ్రీ పి.కృష్ణంరాజుగారు, ప్రొ॥ జి. మోహనరావుగారు, శ్రీ వి. సురేంద్రనాథ్‌గారు, డా॥ సి. సుబ్బలక్ష్మిగారు, శ్రీ నారపరాజు సూర్యనారాయణగారు, డా॥ టి.ఆర్. మీనలోచనగారు ఈ ట్రస్టులో సభ్యులు. ఇటీవల చేర్చుకొనబడిన నూతన సభ్యులు: ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణ కవిగారు, డా॥ ఎ. రాధాకృష్ణరాజుగారు, శ్రీ తంగిరాల శ్రీనాథ్‌గారు, శ్రీ హెచ్.ఎ. మురళీధర్‌గారు.

"శ్రీరస ట్రస్టు" రిజిస్ట్రేషన్ నంబరు: **BNG(U)YLNK/306/2018-2019.** ఈ ట్రస్టుకు కొంత మూలనిధిని సేకరించాలని నిర్ణయించాము. దాతలను మూడు వర్గాలుగా పేర్కొంటున్నాము:–

1. "మహారాజపోషకులు"– రూ.50,000/– లు, ఆ పైన
2. "రాజపోషకులు" – రూ.30,000/–
3. "పోషకులు" – రూ.10,000/–

"శ్రీరస వార్షిక సభ్యత్వం – రూ.2,000/–

**Bank A/c వివరాలు:**

**"SRI RASA TRUST"**
**Karnataka Bank, Sanjayanagar Branch,**
**Bengaluru-560 094.**
**SB A/c No.1132000100116801**
**IFSC Code: KARB 0000113**

**కోశాధికారి :**

శ్రీ నారపరాజు సుబ్బారావుగారు
సెల్ నెం.93419 28981

"శ్రీరస"ను ఒక "ట్రస్టు"గా రిజిస్టరు చేయించడంలో మాకు మార్గదర్శకులుగా ఉండి, ఎంతో శ్రమించిన మా ఉపాధ్యక్షులు శ్రీ పి. కృష్ణంరాజుగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

**ఇంతవరకు "శ్రీరస ట్రస్టు" కు విరాళాలు ఇచ్చిన ఉదార హృదయులైన దాతలు :–**

**I. "మహారాజపోషకులు (రూ.50,000/–):–**

1. శ్రీమతి పర్వతవర్ధని – శ్రీ నారపరాజు సూర్యనారాయణ దంపతులు
2. డా॥ సి. సుబ్బలక్ష్మి, డా॥ సి. సత్యనారాయణ దంపతులు
3. "దానరాధేయ" శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు
4. శ్రీ తెలిదేవర సుబ్బారావుగారు

**II. రాజపోషకులు (రూ.30,000/-):-**

1. శ్రీ తెలిదేవర సుబ్బారావుగారు
2. డా॥ సి. సుబ్బలక్ష్మిగారు
3. శ్రీ పి. కృష్ణంరాజుగారు

**III. "పోషకులు" (2018-2019):-**

**(ఏ) రూ.20,000/- ఇచ్చినవారు:-**

1. శ్రీమతి దేవళ్ళ అపర్ణగారు
2. శ్రీమతి పద్మలత-శ్రీ బాపనపల్లి గోపాల్ దంపతులు
3. డా॥ టి.ఆర్.మీనలోచనగారు
4. ప్రొ॥ జి. మోహనరావుగారు
5. శ్రీమతి లలితా ప్రసాద్‌గారు-డా॥ పి. హెచ్. ప్రసాద్ దంపతులు

**(బి) రూ.10,000/- ఇచ్చినవారు:-**

1. శ్రీ సి. జయరామరెడ్డిగారు
2. శ్రీ నారపరాజు సూర్యనారాయణగారు
3. శ్రీమతి కె.ఎస్. మనోరమగారు
4. ప్రొ॥ వేదుల సుబ్రహ్మణ్యంగారు
5. శ్రీ పెద్ది సత్యనారాయణగారు
6. శ్రీ పి.వి. రాధాకృష్ణగారు
7. శ్రీ వి. సురేంద్రనాథ్‌గారు
8. శ్రీ నారపరాజు సుబ్బారావుగారు
9. ప్రొ॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు
10. డా॥ ఇప్పగుంట మాధవరావుగారు
11. కర్నల్ తంగిరాల కృష్ణమూర్తిగారు
12. శ్రీమతి తంగిరాల సీతామహాలక్ష్మిగారు
13. శ్రీ ఇవటూరి సాంబశివరావుగారు
14. డా॥ ఎ. రాధాకృష్ణరాజుగారు
15. శ్రీమతి దండు రాజేశ్వరిగారు
16. శ్రీ దేవళ్ళ బదరీనాథ్‌గారు
17. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు
18. శ్రీ ఎం. సాయిశ్రీకాంత్‌గారు
19. శ్రీ మల్లాది శ్రీనివాస్‌గారు
20. ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణకవిగారు
21. డా॥ హరి పవన్‌కుమార్‌గారు
22. శ్రీమతి అంబికా అనంత్‌గారు
23. శ్రీ కరణం నాగరాజారావుగారు
24. డా॥ కె. నాగేశ్వరశాస్త్రిగారు
25. శ్రీ తంగిరాల శ్రీనాథ్‌గారు
26. శ్రీమతి లొల్ల లక్ష్మీకామేశ్వరరావుగారు
27. శ్రీమతి కె. నటరాజ్‌గారు
28. శ్రీపాతపాటి వరదరాజుగారు
29. శ్రీ ఎం.ఏ. గోవిందరాజుగారు
30. శ్రీ కె.వి. శాస్త్రిగారు
31. డా॥ బొడ్డుపల్లి వీరరాఘవస్వామిగారు
32. శ్రీ టి.వి. నరసింహారావుగారు
33. శ్రీమతి చక్రావధానుల పద్మ-శ్రీలంక చంద్రశేఖరం దంపతులు

తెలుగు సాహిత్యప్రియులు, వదాన్యులు ముందుకు వచ్చి, "శ్రీరస ట్రస్టు"కు ధారాళంగా విరాళాలు ఇవ్వవలసిందిగా మనవి చేస్తున్నాం.

**"శ్రీరస" సభలు - వివిధ వేదికలు:-**

1994లో స్థాపించబడిన "శ్రీరస" సాహిత్యసభలు మొదట కొన్ని ఏండ్లపాటు బెంగుళూరు విశ్వవిద్యాలయం, సెంట్రల్ కాలేజి, సెనేట్ హాలులో జరిగాయి. తరువాత కొన్నిసార్లు మహాలక్ష్మి లేఅవుట్‌లో ఉన్న డా॥ దివాకర్ల రాజేశ్వరిగారి యింట్లోను, మరికొన్నిసార్లు మల్లేశ్వరం, 13వ క్రాసులో ఉన్న శ్రీమతి అంబికా అనంత్‌గారి యింట్లోను జరిగాయి.

పిమ్మట చాలా ఏండ్లపాటు మల్లేశ్వరం 8వ క్రాసులో ఉన్న "గాంధీ సాహిత్య సంఘం" లో నిర్వహించాము. అదే మల్లేశ్వరంలో ఉన్న శ్రీ వేణుగోపాల స్వామివారి ఆలయంలోను, శ్రీ కన్యకాపరమేశ్వరీ అమ్మవారి దేవాలయంలోను కూడా చాలా సభలు జరిపాం.

ఆ తరువాత 2009 నుండి 2016 (డిసెంబరు నెల) వరకు 8 సంవత్సరాల పాటు Indian Institute of Science (Tata Institute) లో "శ్రీరస" సభలు ఎంతో హుందాగా నడిచాయి. అక్కడి తెలుగువారైన Post-Graduate విద్యార్థులు, Ph.D. విద్యార్థులు ఈ సభలలో చురుకుగా పాల్గొన్నారు. డా॥ వి. శివరామకృష్ణ, డా॥ హరి పవన్ కుమార్, డా॥ జి.పి.ఆర్. యశస్వి, డా॥ వి. శేషాద్రి మరియు ఆ Institute లోని "తెలుగు సాంస్కృతిక సమితి" కార్యవర్గ సభ్యులు మా "శ్రీరస"కు చేసిన సేవ, అందించిన సహాయ సహకారాలు నేను ఎన్నటికీ మరువరానివి. వారందరికీ నా అనంతమైన ఆశీస్సులు... ప్రియమిత్రులు ప్రొ॥ జి. మోహనరావుగారు I.I.Sc. Guest House లో ముఖ్యఅతిథికి, "శ్రీరస" అధ్యక్షులకు భోజన సదుపాయము, వసతి సౌకర్యము ఏర్పాటు చేసేవారు. వారికి మా "శ్రీరస" మిక్కిలిగా ఋణపడి ఉన్నది. 2017 జనవరినెల నుండి ఈనాటి వరకూ మా "శ్రీరస" సభలు సంజయనగర్‌లో, శ్రీ వరసిద్ధి వినాయకస్వామివారి దేవాలయంలో, ప్రత్యేకంగా నిర్మించిన "శ్రీశంకర అధ్యయన కేంద్రం. శ్రీ రామమందిరం" అనే ప్రవచన భవనంలో నిర్విఘ్నంగా జరుగుతున్నాయి. ఇక్కడ ఏర్పాటు చేయడంలో ఎంతో సహకరించిన మా "శ్రీరస" ప్రధాన కార్యదర్శి శ్రీ పి.వి. రాధాకృష్ణగారికి మిక్కిలి కృతజ్ఞుడను. ఈ ప్రవచన మందిరాన్ని నిర్మించిన శ్రీ ఆర్. వెంకటాచలపతిగారికి, దీనిని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దడంలో భూరి విరాళాలతో ముందుకు వచ్చి ఎంతో సహకరించిన మా "శ్రీరస" మహారాజ పోషకులకు– ముఖ్యంగా శ్రీనారపరాజు సూర్యనారాయణగారికి, డా॥ సి. సుబ్బలక్ష్మిగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియ జేసుకుంటున్నాను. ఈ ప్రత్యేక సంచికను తలపెట్టిన మా కృష్ణంరాజుగారికి, దీనికి ప్రకటనలిచ్చిన వారికి నా అభినందనలు.

**ఇట్లు**
**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

## "శ్రీరస" కార్యవర్గ సభ్యులు

*వ్యవస్థాపక అధ్యక్షులు:*
**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు**
**(99454 22742)**

*వ్యవస్థాపక కార్యదర్శులు:*
**డా. దివాకర్ల రాజేశ్వరిగారు**
**శ్రీమతి అంబికా అనంత్‌గారు**

*ఉపాధ్యక్షులు:*
**ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణకవిగారు**
**శ్రీ పి. కృష్ణంరాజుగారు**

*ప్రధాన కార్యదర్శి:*
**శ్రీ పి.వి. రాధాకృష్ణగారు**
**(97400 68936)**

*మహిళా కార్యదర్శులు:*
**శ్రీమతి మారుతి శ్రీలతగారు**
**డా॥ టి.ఆర్. మీనలోచనగారు**

*కోశాధికారి:*
**శ్రీనారపరాజు సుబ్బారావుగారు**

# శ్రీ ఆండాళ్ళు

# తిరుప్పావు

## (రాగతాళయుక్తములైన కీర్తనలుగా అనువాదము)

- దేవులపల్లి కృష్ణశాస్త్రి

---

### హరియె పాడించాలి

(ఆవాహన)

౧

కృతిమాలిక నవ సుమమాలికతో
జత చేరిచి పతి కిడినావా?
అతుల దివ్యరాగ లోలా! నీలా
పతి ప్రియురాలా! వ్రతశీలా! గోదా! ॥ కృతి ॥

తులసీవనిలో మొలకగ కలిగి,
అల పెరియాళ్వారుల కడ పెరిగి,
వలచి శ్రీరంగవల్లభుని, స్వామి
లలిత వనమాలికా దళముల పెనగి ॥ కృతి ॥

నీ యడుగుల నలదిన పారాణి
నా యెదలో నంటిన హరిరాణి!
రేయిపగలు "ఫణిశాయీ! ఓ వర
దాయీ" అని పాడదొ కల్యాణి ॥ కృతి ॥

(సురటి రాగము - ఆది తాళము)

౨

సుందరాతి సుందరా! ఇందిరా
సుందరీ హృదయ మందిరా!
అందరాని నీ సొగసు నా కనుల
కందె నౌర, శ్రీరంగ విహారా! ॥సుందరా॥

బాలచంద్రరేఖ పోలు తీయని
లోల మందహాసమ్మును కనికని,
పాలకడలి వెన్నకన్న మెత్తని
జాలి చూపు నీ చూపుల కనికని,
రేలు పవళులును తలచి తలచి నను
ఏలుకొందువని కలలు కందు! ఓ ॥సుందరా॥

ఒక్కసారి నను చేరిచేరి, నా
ప్రక్క ప్రక్క నిలబడినటు లౌను!
ఒక్కసారి నా హృదయపీఠిపై
ఎక్కి కొలువు తీరిచినటు లౌను!
అక్కటకట! అంతలోనె దవ్వయి
ఎక్కడెక్కడో ఉన్నటు లౌను! ॥సుందరా॥

(కాంభోజి రాగము - ఆది తాళము)

౩

అడుగిడు మొకపరి తల్లీ
అంధ మూక మందిరమున!
కడు బరువాయెను గడవక,
గడియ గడియ మాట రాక! ॥అడు॥

మదిలో కోవెలలో నీ
మన్ననారు పదిలపరచి,
కదలనీవు క్షణక్షణము
కలగీతికయై కరగ ॥అడు॥

కొసవ్రేళుల కాస్త వీని
గొంతు తాకి సెల విడవా?
మసిలే మౌనము గీతా
మణిదీపికలై వెలుగ ॥అదు॥

(హిందోళ రాగము - త్రిశ్రత్రిపుట తాళము)

౪

హరియె వినిపించాలి!
హరియె పాడించాలి!
అమృతవల్లి నోట
ఆండాళ్లు పాట!

తిరువరంగమునుండి దిగివచ్చునో,
కరుణించి ఒక బేల రుతి మెచ్చునో,
సురమౌని మహతి సంస్తుతికి మురిసేవాడు,
వర త్యాగరాజ కీర్తనల కలరే రేడు! ॥హరియె॥

విరజాపగా సలిల మాధురుల నిచ్చి,
పొరలేటి కావేరి ఝురుల కొనితెచ్చి,
అరిది కనుకొనల ఒకచూపు పరపించి,
చిరునవ్వుమల్లె ఒకరేక విరియించి! ॥హరియె॥

(రీతిగౌళ రాగము - ఖండచాపు తాళము)

## అంతా హాస్యమయం

1972లో తూర్పు గోదావరిజిల్లా రచయితల మహాసభలు కాకినాడలో జరిగాయి. ఓ వందమంది పైగా ప్రతినిధులు పాల్గొన్న ఆ సభలో మొక్కపాటి నరసింహశాస్త్రిగారు అధ్యక్షపీఠం అలంకరించారు. ఉదయం పదిగంటలకు ప్రారంభమైన సాహిత్య సభ సాగి సాగి మధ్యాహ్నం ఒంటిగంటదాకా నడిచింది.

ఆనాటి ఎజెండాలో చివరి అంశం 'దివంగతులైన కవి ప్రముఖులకు సంతాపం ప్రకటించడం–' ప్రతినిధులు అప్పట్లో ఏ ఏ దేశాల్లో ఎవరెవరు ప్రముఖ రచయితలు మరణించారో ఒక జాబితా తయారు చేస్తున్నారు. లిస్టు క్రమక్రమంగా పెరిగిపోతోంది. కాలాతీతం అయిపోతోంది. అధ్యక్షపీఠం నుంచి మొక్కపాటివారు సమావేశాన్ని ముగించడానికి తొందరపడుతున్నారు. అవతల భోజన సమయం మించిపోతోంది. సభ్యులు యిదేమీ పట్టించుకోకుండా లిస్టులో పేర్లు సూచించే పనిలో పడిపోయారు. ఈ పరిస్థితి మొక్కపాటివారికి విసుగు, కోపం తెప్పించింది. ఆయన మైకు అందుకుని – "అయ్యా, సభ ముగిద్దామంటే తమరు వినకుండా మీరు గతించిన పెద్దల లిస్టు తయారు చేస్తున్నారు. వంటలు పూర్తి అయినాయి. పదార్థాలు చల్లారిపోతున్నాయి. మీరు ఇక ఎంత మాత్రం జాప్యం చేసినా నా పేరు కూడా ఆ జాబితాలో చేర్చవలసివస్తుంది." అన్నారు తన అసహనాన్ని కూడా హాస్యంలోకి మారుస్తూ –

**(–శ్రీరమణగారి 'హాస్యజ్యోతి' నుండి)**

# తిరుప్పావు

## (ఆండాళ్లు పాట)

### 1

రారమ్మ ఓ అమ్మలారా! రారే మమ్మ!
నీరాడ మనసున్న వారు, మీరూ – మీరు!
శ్రీరమ్యమైన మన వ్రేపల్లెలోన
చేరి, కన్నియలార! కూరిమి చెలులార! ॥రారమ్మ॥

ఇది మార్గశిరము, వెన్నెలవేళ, భాసురము!
ఇది పరవాద్యవ్రతారంభ వాసరము!
మదిలోన జగమెల్ల ముదమంది పొగడ,
కదిసి కంకణ కటక కింకిణులు కదల ॥రారమ్మ॥

మరిమరీ కనికనీ మెరసేటి కనులతో
మురిసే యశోదమ్మ ముద్దు సింగపు కొదమ,
కరిమొయిలు మెయిహొయలు గల అందగాడు,
వరదుడౌ మనరేడు వ్రతమేలువాడు ॥రారమ్మ॥

కరమందు కరకువాల్ కాపుగా దాలిచి
వరలేటి మేటినందుని నందనుండు
అరుణశశిబింబనిభ శుభవదనుడు
సరసిజాక్షుడె నోము కరుణింపగా ॥రారమ్మ॥

(బిలహరి రాగము – ఆది తాళము)

### 2

వినరమ్మ, వినరమ్మ, మననోము తీరు!
పనిబూని చేసిన మన సిరులు మీరు!

అల పాలకడలి ఊయెల శేషశయ్యపై
అలవోక నిదురించు హరి శ్రీపదాబ్జాల
తలచుకొనుచు, సారె కొలుచుకొనుచు,
తొలివేగుబోక నీరాడవలె చెలులార! ॥వినరమ్మ॥

వలదు క్రోలగ పాలు, వలదు త్రావగ నేయి!
వలదు కాటుకపూత మన కన్నుదోయి!
అలరులు కైసేయ వలదు క్రొమ్ముడులలో!
లలనలారా! నోము నోచిన దినాలలో! ॥వినరమ్మ॥

పరమాత్ముడౌ ప్రభువు సరస, పరులపై
దురుసుమాటలు నోట తొడుగరా దమ్మ!
దరియనీరాదు ఘనులొల్లని పనులను!
జరుపవలె ముదమున దానధర్మములను! ॥వినరమ్మ॥

(పంతువరాళి రాగము – ఖండచాపు తాళము)

### 3

ఎనలేని సిరులతో నిండును
ఈ సీమ
ఈతిబాధలు కలుగకుండును!

ముసుకొని త్రివిక్రముని నామములు పాడి
మొనసి మా నోమునకు తాన మాడితిమేని ॥ఎనలేని॥

నెలనెలా మూడు వానలు కురియును,
బలిసి ఏపుగ పైరు లెదుగును,
అల పైరుసందులను మీ లెగురును,
కలువల ఎలతేంట్లు కనుమూయును. ॥ఎనలేని॥

కడిగి కూర్చుండి పొంకంపు చన్నులను
ఒడిసి, పిదుకగ, పట్టి – రెండు చేతులను
ఎడము లేకుండ పెను జడుల ధారలను
కడవల ఉదార గోక్షీరములు కురియును.॥ఎనలేని॥

(మధ్యమావతి రాగము – ఖండచాపు తాళము)

## 4

కురియుము కురియుము వర్షము!
వరలగ జగతికి హర్షము!
ఓయీ గంభీర హృదయ!
ఓహో వర్ష నిర్వాహ! ॥కురియుము॥

మురిసి మార్గశిరస్నాన
మును మే మొనరుప తడయక ॥కురియుము॥

జలనిధిలో జొరబడి, అట సలిలమెల్ల త్రాగి త్రాగి,
ఫెళఫెళమని గర్జింపుచు, బిరబిర పై కెగసి ఎగసి,
అల కాలోపలక్షిత జగత్కారణుని మూరితి
వలె నీ మెయి నీలనీలవర్ణముతో తేలతేల
॥కురియుము॥

సుందర పటు బాహుపు అరవిందనాభు మేటికరము
పొందిన శ్రీ సుదర్శనము పొలుపున తళతళా మెరసి.
క్రందుగ దక్షిణావర్తమగు శ్రీ పాంచజన్యమ్ము
చందమ్మున ఉరిమి, శార్ఙ్గమట్లు అంపజడులు చిమ్మి
॥కురియుము॥

(అమృతవర్షిణి రాగము - ఆది (త్రిశ్రగతి)తాళము)

## 5

చెప్పరే! చెప్పరే! శ్రీనామములను!
ఒప్పుల కుప్పలార! తప్పక! తప్పక!
ఎప్పుడో చేసిన తప్పులన్నీ నశింప
నిప్పులో తూలికలుగా! ఇప్పుడే! ఇప్పుడే! ॥చెప్పరే॥

అల్ల వ్రజవంశమ్మునకు కల్యాణదీపమ్మైనవాని,
తల్లికడుపున కెల్లవేళల చల్లనగు వెలుగైనవాని,
అల్లన, అమలినలుగా ఏతెంచి, ధ్యానించి, ధ్యానించి,
సల్లలిత సుమము లర్పించి, సేవించి, సేవించి
॥చెప్పరే॥

మాయవాని, ఉత్తర మధురాపురికి రేడైనవాని,
హాయిగా గంభీర యమునా తీరమున విహరించువాని,
ఈయెడ, దామోదరుని ధ్యానించి, మరిమరి ధ్యానించి,
తీయని అచ్చంపు పువు లర్పించి మరిమరి సేవించి
॥చెప్పరే॥

(తోడి రాగము - మిశ్రచాపు తాళము)

## 6

తెలవారుచున్నదిగదే! లేవే! లేవవే!
కలకలా కూసేను పులుగులు - ఓ బాల!
అల గరుడవాహనుని గుడినుండి తెలిసంకు
అదిగదిగొ పిలిచేను, లేవే! బాల లేవే! ॥తెల॥

ఓలి పెనువిసపు చనుబాలు పీల్చినవాని,
లీల మాయశకటము కాల కూల్చినవాని,
మేలుకొని, ఋషులు యోగులు మనసున లోనగొని
మరిమరీ హరిహరీ యను మహాఘోషమ్ము
చొరబారి మా యెదలలో
చలచల్లనాయె గదవే... ॥తెల॥

పాలకడలిని పాపపానుపున యోగ ని
ద్రాళువగువాని కారణభూతుని
మేలుకొని ఋషులు యోగులు మనసున లోనగొని
మరిమరీ హరిహరీ యను మహాఘోషమ్ము
చొరబారి మా యెదలలో
చలచల్లనాయె గదవే! ॥తెల॥

(కల్యాణి రాగము- ఖండచాపు తాళము)

## 7

వినలేదటే వెఱ్రి జవరాలా!
వినియె హాయిగ పవ్వళించేవటే!
తనితనిగ తెలవారెనని కీచుకీచుమని
మునుమునుగ ఏటిరింతలు మూగి పలికేను
॥వినలే॥

ఘల్లుమనగా కంఠసరులు కాసులపేర్లు,
జల్లగా కడల క్రొమ్ముడులు వాసనలు,
గొల్ల యిల్లాండ్రు తరిగోలలను కై కొనుచు,
పెల్లుగా చల్ల తరిచే సవ్వడి ॥వినలే॥

హరిని నారాయణుని కైవారముల మేము
ఆలపించిన ఆలకించనే లేదటే!
దొరసాని వొరౌర! ఓ బాల లేచి
తెరవవే వాకిలి ఓసి తేజోవతీ! ॥వినలే॥

(సింహేంద్ర మధ్యమ రాగము - ఖండచాపు తాళము)

## 8

చానా! లేవే! చాలే పవళింపులు!
చానా! లేవే! చాలులే పవళింపులు!
ఔనే! చెలుల అచట ఆపి వచ్చేమే!
పూని నోము, స్నానమాడ వలచేదాన! ॥చానా॥

అల్లదే! చూడవే! తూరుపు
తెల్లవారెనె, ఎనుము కదుపులు
మెల్లగా తరలెనే, మంచున
తడియు పచ్చిక బీళ్ళ మేయగ! ॥చానా॥

చేరిచి వాద్యముల కైవారముల కావింప
కూరిమితో దేవదేవుడు కృపను మనపై చూపునే!
వారువము వలె వచ్చు రక్కసు
నోరు చీరినవాని వేడగ
క్రూర చాణూరాది మల్లుల
బీర మడచిన వాని పాడగ! ॥చానా॥

(నీలాంబరి రాగము - మిశ్రచాపు తాళము)

## 9

మనవి వినవే! మామకూతుర!
మణికవాటము తీయవే!
మణిఖచిత సౌధమ్ములో పరి
మళపు దివ్వెల వెలుగులో
నును తలిమమున కనులు మొగిడిచి
కునుకుదువుగానీ! లేవే! ॥మనవి॥

మూకయో! చెవిటిదో! అత్తా!
ముద్దులా చిన్నారి కూతురు!
కాక కావలి కదలనీయరొ?
గాఢనిద్రా మంత్ర మేసిరొ? ॥మనవి॥

"శ్రీకరా! వైకుంఠ నాథా!
మాధవా! మాయావి! హరి" యని
నీ కుమార్తెను లేపుమా, శుభ
నామ పారాయణముతో! ॥మనవి॥

(హమీర్ కల్యాణి రాగము - మిశ్రచాపు తాళము)

## 10

పోనీ తలుపు తీకుంటే
మానేవు గానీ!
ఔనే! ఒక మాటైనా
మాతో అనవేమీ?

చానా! నోమూని స్వ
ర్గానూన భోగముల
ఆనందించేదాన
మా తల్లి కాన! ॥పోనీ॥

నారాయణుడు కోమలామోద తులసీ
శ్రీరుచిరమౌళి మనపాలి వరదాయి!
గారాన మనకు పరవాద్యమ్ము కరుణించు!
నోరార చేయు కైవారముల ఆలించు! ॥పోనీ॥

(అసావేరి రాగము - మిశ్రచాపు తాళము)

## 11

రావే! గోపవంశాన రాజిల్లే లతకూన!
రావే! పాముపడగ బోలే కటికలదాన!

లేవే! నీరదశ్యామ మోహనుని నామముల
నీ వాకిటనే నిలిచి నీవారు పాడేరు! ॥రావే॥

మేలి పొదుగుల ఆలు వేలు కలవారు, ఆ
భీలరణమున అరుల బీర మడచేవారు, గో
పాలకుల కులమున వెలసే ఓ వనమయూరీ!
లేవే కలుములనెలవౌ ఓ నారి! ఒయ్యారి! ॥రావే॥

(శహన రాగము- మిశ్రచాపు తాళము)

## 12

ఏమి వింతలొగాని, చెలియరో! అయ్యయో!
నీమదిని క్రమ్మినది ఏ మాయ నిదురో!
జామాయె నీయింటి మోసాలలో వేచి,
ఈ మంచులో గడప నానుకొని నిలిచి! ॥ఏమి॥

వైరియౌ లంకాధిపతిని తునుమాడిన
శౌరిపై, ఆ మనోహారిపై, మా పాట
ఊరివా రెల్లరును చెవులార విన్నారు!
ఔరౌర! ఇకనైన లేవమ్మ! మా అమ్మ! ॥ఏమి॥

తన లేగలను తలచికొని అరచి చేపుగొను
చనుమొనల, ఎనుము ఎడతెగక కురిసే పాల!
మునివాకిటను బందగానైన వీటిలో
ఎనలేని సంపదలు గలవాని చెల్లెలా! ॥ఏమి॥

(కాపి రాగము - ఆది తాళము)

## 13

లలితశయనా! చలిత
హరిణ నయనా! లెమ్మ!
తెలవారుచున్నదమ్మా!
అలరు కొమ్మా! తళుకు
పసిడిబొమ్మా! లెమ్మ!
తెలవారు చున్నదమ్మా! ॥లలిత॥

పులుగు లవె మేతలకు తరలేను-
మెల్ల మెల్ల గురు దస్తమించేను-
అల శుక్రతార మింటను పొడిచెను!
కలసి మాతోరమ్మ! కపటమును విడవమ్మ ॥లలిత॥

బకదైత్యవైరి ఆ దశకంఠ సంహారి
అకలంక చరితముల ఒకచోట చేరి
ఈ పుణ్యదివసాన సకియలు పాడేరు
తీపారు వలినీట తీర్థమాడగదమ్మ!

తెలవారుచున్నదమ్మా!
లలితశయనా! హరిణ నయనా!

(అఠాణా రాగము - ఖండచాపు తాళము)

## 14

కలువ కనుమూసినది
కమలమ్ము పూచినది
కలికిరో! నీ పెరటి కొలనులో!

తెలిదంతముల జియ్యరులు, కావి తాలుపులు
తరలేరు, కుంచెకోలల తెరవ కోవెలలు! ॥కలువ॥

మిమ్ము నేనే వచ్చి మేలుకొలిపెద నని
అమ్మ చెల్లా! నీవు నిదురింతువే!
కమ్మగా నెరవాది మాటలన్నీ ఆడి
ఎమ్మెలాడీ! నీవు సిగ్గుపడవే! ॥కలువ॥

వర శంఖచక్రధారిని, హరిని, శౌరిని
పురుషోత్తముని వికచ జలజ లోచనుని
తరుణు లందరితోడ తనివారగా పొగడ
తరలిరావమ్మ! నిద్దురమాని, ఓకొమ్మ! ॥కలువ॥

(సారంగ రాగము – ఖండచాపు తాళము)

## 15

"ఓ చిరుత రాచిలుక! లేచి రావేమే! వేచియున్నామే!"

"వేచేవారి నిదుర దోచుకున్నానో!
ఓ చెలులు! నా నిదుర దాచుకున్నానో లేచి వచ్చేనే!"

"భళిభళీ! సఖి! ఎంత నుడికారితనమే!
తెలుసులే నీ నంగనాచితనము మాకు!"

"మీరు గడుసరులు కారేమొ పాపము!
నేనే కాబో లంత నేరవని దాన!
వచ్చిరో అందరును నెచ్చెలులు?"

"ఆ! వచ్చి నీవే లెక్క పెట్టుకోవే!
విచ్చేయవే, అమ్మ చెచ్చెర! లేకున్న
మచ్చిక పని యున్నదేమొ ఏదయిన!" ॥ఓ చిరుత॥

"ఉరు మత్తగజకుంభ మురియ మొత్తినవాని,
అరుల దర్పమ్ము నరవర చేయువాని.
అరిది గుణములవాని, హరిని కీర్తింప
అరుగగా వలయు బిరబిర రమ్మ! ఓ అమ్మ" ॥ఓ చిరుత॥

(హిందోళ, ఖమాన్ – ఖండచాపు తాళము)

## 16

నందగోపస్వామి మందిర రక్షకా!
సుందర ధ్వజ తోరణ ద్వారపాలకా!
వల్ల కాదనకు! వలదనకు మునుమున్నె,
అల్లన రతనాల తలుపుగొళ్లెము తీయ ॥వల్ల॥

కల్లకపటములేని గొల్లకన్నెల మన్న!
నల్లని తిరుమేని వానికై వచ్చేము ॥వల్ల॥

మ్రోయు పరవాద్య మిడెదనని నిన్ననే
మాయలాడు తానే మాట యిచ్చేనని
ఈయెడ తానమాడి ఏతెంచినా మన్న!
తీయుమా తలుపు! పాడేము మేల్కొలుపు! ॥వల్ల॥

(మాయా మాళవగౌళ రాగము–మిశ్రచాపు తాళము)

## 17

మేలుకో! మేలుకో!
చాలించి నీ నిదుర – మేలుకో!
ఏ లేవడి రానీక ఎలవేళ లరసే మా
ఏలికా! నందగోపాలకా! మేలుకో! చాలించి నీ నిదుర
తల్లీ! వ్రజవల్లీ నవపల్లవాభిరామా!
అల్లన లేవమ్మ! యశోదమ్మ! నందగృహ దీపమ!
॥మేలుకో॥

భువిని దివిని మీరి భువన భువనముల నిండే
త్రివిక్రమా! పురుషోత్తమ! దేవదేవ! శ్రీకృష్ణా ॥మేలుకో॥

ఆలించి మనవి మా మేలెంచి ఏలుకో!
కనకవీరమంజీరము ఘనపదముల తొడవుగా
తనరే బలదేవా! నీ తమ్మునితో మేలుకో!
ఆలించి మనవి మా మేలెంచి ఏలుకో!

(మోహన రాగము – రూపకము తాళము)

## 18

నందగోపుని కోడలా! ఓ నీల!
ఎందుకమ్మా తలుపు తీయవు!
విందువా కోళ్లు కూసేను, ఆవంక గురి
విందు పొదలందు పలికేను గోరింక! ॥నంద॥

కందుకము వ్రేళ్ల సందిటను కలదాన!
అందమగు కురుల నెత్తావి కల లలన!
కుందనపు కంకణాల్ చిందులాడీ పాడ
కెందమ్మి పోలేటి నీ సోగ కేల ॥నంద॥

సుందరుడు నీ స్వామి శుభనామములను మన
మందరమునూ కూడి పాడుకొందాము!
క్రందుకొను గంధసింధుర బలముతో, వైరి
బృందముల క్రిందుపడజేయ గలిగేవాని ॥నంద॥

(బౌళిరాగము – ఆది తాళము)

## 19

పలుకవా నళినేక్షణా!
బదులైన
పలుకవా నవమోహనా!
పలుకవా రవ్వంత? పవ్వళింతువుగాని
కలికి చనుగవపైని తలగడగ కేలూని ॥పలుకవా॥

తళుకు దంతపుకోళ్ళ మంచమ్ముపై,
లలిత సురభిళ పంచ తల్పమ్ముపై,
ఒరిగి కప్పుర దివ్వె వెలుగులో, అల నీల
నెరుల విరితావిలో, నిదురింతువేగాని ॥పలుకవా॥

గడెయైన వల్లభుని ఎడబాయవు;
తడవైనగాని నిద్దుర లేపవు;
సొగసు కాటుకరేక సోగకన్నులదాన!
తగదమ్మ నీవంటి సుగుణవతి కో చాన! ॥పలుకవా॥

(మలయమారుతము రాగము – ఖండచాపు తాళము)

## 20

మేలుకో శ్రీకృష్ణ! మేలుకొన వేమీ!
చాలుబడి గల దేవ! మే లొసగు స్వామీ!

మున్నేగి ముప్పదియు మూడుకోటుల సురల
బన్నముల బాపు బలశాలి! వనమాలీ!
వెన్నుదవిలి విరోధివితతికి వనటగూర్చి
చెన్ను తొలగించు ఆపన్న జనతావనా! ॥మేలుకో॥

మేలుకో ఓ సిరీ! శాతోదరీ!
మేలుకో ఓ నీల! పరిపూర్ణురాలా!
మేలుకో నవకిసలయాధరా!
కలశోపమ పయోధరా! ॥మేలుకో॥

ఆలవట్టము అద్ద మొసగి నీ స్వామిని
ఆలసింపక పంపవమ్మ నీరాడ! ॥మేలుకో॥

(సావేరి రాగము – ఖండచాపు తాళము)

## 21

బంగరు కడవలనిండా పాలు
పొంగి పొరల కురిపించే ఆలు
చాల కలుగు నందుని గారాల నందనా!
ముని హృదయ స్యందనా!

వైకుంఠము విడిచి, లోక
లోకమ్ములు కడచి,
మాకోసము దిగివచ్చిన మా స్వామీ! మేలుకో!
మేలుకో తేజోమయ! నీలాప్రియ! మేలుకో!
మేలుకో భక్తాశ్రితపాళీ సరసిజహేళీ!

వైరులు నీ శౌర్యమ్మున కోడి,
సైరింపక, నీ వాకిట కూడి,
బీర మేది శ్రీపదముల
వారక కొలిచే తీరున,
చేరి మంగళాశాసన
మును చేసి, ముదమ్మున కై
వారమ్ములు చేసి, వచ్చి
నారమయ్య, నిదురమాని మేలుకో!

(ఉదయరవిచంద్రిక రాగము – ఆది తాళము)

## 22

ఏదీ ఏదీ! నీ దయావీక్షణము ఏదీ ఏదీ!
ఇంచించుక పరపుము మాపై, మాపై!
చిరుగజ్జెలవలె విరిసే ఎరనెర్రని తామరల
తెరగున వికసించే ఆ కెంజాయ కందోయి! ॥ఏదీ॥

అందమగు ఈ లోకమందలి ఏలికలు
అందరును మానాభిమానములు వీడి
సుందరము నీ గద్దెక్రింద బృందములైన
చందమున, నిలుచు మా డెందములు చల్లబడ! ॥ఏదీ॥

ఒక్క కనుకొస చూపె చాలును, చాలును–
పాపముల పరిమార్పను!
ఒక్క కనుకొన ప్రాపె చాలును, చాలును–
తాపముల చల్లార్చను! ॥ఏదీ॥

(కానడ రాగము – ఖండచాపు తాళము)

## 23

తరలి రాగదే, దేవ! దయచేయగదే!
దరిసింపగ వచ్చిన మా పని విని పాలింతుగాని!
తరలి రాగదే!

వానకారులోన సింహ మొకడు మేల్కాంచి, పొడవు
మేను సారించి, ధూళి తూలించి, కెంపుకనుల
మానుగ వీక్షించి, పరిమళభర సట లూగ, గహ్వ
రాననుండి వెలువడు చందాన మందిరమునుండి
తరలి రాగదే!

భాసుర బహురత్న ఘటిత భర్మ సింహ పీఠికా
ధ్యాసివై, అనుగ్రహోల్లాసివైన స్వామీ! అత
సీ సుమ కోమల శ్యామమోహను, లోకావను, నిను
చూసిచూసి, మనసు వెళ్ళబోసి, కృతార్థులము కాగ–
తరలి రాగదే!

(హంసధ్వని రాగము – ఆది (త్రిశ్రగతి) తాళము)

## 24

మంగళమని పాడ వస్తిమి,
మరిమరి నీ మగటిమికి – మంగళమని!
ముంగిట నిలబడిన మా కొ
సంగుదువని పరవాద్యము ॥మంగళ॥

అల్లనాడు లోకమ్ముల
అలవోకగ కొలిచిన నీ
పల్లవారుణ శ్రీపద
పద్మములకు మంగళమని,
పెల్లుగ నీ వెత్తి వెడలి
సుందర లంకాద్వీపము

తల్లడబడ మాపిన నీ
దర్పమునకు మంగళం - ॥మంగళ॥

కాలదన్ని ఒక త్రుటిలో
కరకు శకట దైత్యుని
నేల రాలు నటు చేసిన
నీ కీర్తికి మంగళమని,

కూళను వత్సాసురు నవ
లీలగ చిరుకోలవోలె
తూలవిసురు దుడుకు అడుగు
దోయికినీ మంగళం! ॥మంగళ॥

దండిగ గోకులమునకై
దయదాలిచి గొడుగువోలె
కొండ నెత్తివేసిన నీ
గుణమునకును మంగళమని,

భండనమున నొక వ్రేటున
పగతుర పీచ మ్మడంచి
చెండాడిన నీ చేతి ప్ర
చండాసికి మంగళం! ॥మంగళ॥

(ఆనందభైరవి రాగము - రూపకము తాళము)

## 25

అర్థలము, అనుగులము,
అంజలింప వచ్చినాము!
అడిగిన వర మిడుదు వని,
అనురాగపు గని వని!

ఒక అమ కొమరుడవై, వే
రొక అమ ఒడిలో దాగి,
ఒదిగిన నిను హింసింపగ
ఊహించిన కంసునకు
అసురునకు కడుపుమంటవు!
అర్థుల కమృతాల పంటవు! ॥అర్థులము॥

సిరికూడా వలచే నీ
దొరతనమూ, దోర్వీర్యము
పరవశమున పాడి పాడి
విరహమెల్ల మరతుము!
పరవాద్యము కరుణింపుము
పరమానంద మొసంగుము! ॥అర్థులము॥

(ఆరభి రాగము - రూపకము తాళము)

## 26

అవధరింతువా! అనుగ్రహింతువా!
ఆశ్రితజనవత్సలా! నీ వవధరింతువా?
మార్గశిర స్నానమునకు మా నోమునకు
మాకు వలయు వానిని మహేంద్రమణి ప్రభావమూర్తి
॥అవధరింతువా?॥

క్ష్మామండల మదరిపడగ శబ్దించేవీ,
పాలవన్నె నొప్పారెడు పాంచజన్య మట్టివీ,
శంఖములూ, ప్రబల బహుళ
పటహములూ పరవాద్యము-లను గ్రహింతువా!
॥అవధరింతువా?॥

మంగళ మణి దీపికల,
భృంగారువు, చందువాల,
బంగారపు పళ్లెరాల,
రంగురంగు ధ్వజపటాల,
పొంగుచు మంగళాశాస
నము పాడే గాయకుల
అవధరింతువా! అనుగ్రహింతువా!
ఓ వటపత్రశాయీ! వరదాయీ! వరదాయీ!

(కీరవాణి రాగము - రూపకము తాళము)

## 27

వేదవచ్చునా మరికొన్ని, మా
వేడుకకై కొన్ని,
కూడనివారిని ఓడించే శుభ
గుణములు గల గోవిందా!
ఆడువారి కోరిక లనుకోకు!
కూడదనకు గోవిందా! నీ
రాడి వచ్చి వ్రతమూనిన ముదమున
అడిగెద మంతే స్వామీ!

సూడిగములు, జుమికీలు, చెవాకులు,
పాడగములు, కేయూరములు,
తొడవులన్ని కయిసేయగ వలదో!
తొడవలదొ పలువన్నెల వలువలు! ॥వేద॥

ఇంతకన్న శుభవేళ ఏదీ?
ఇంతకన్న ఆనంద మేదీ?
బంతులుగా నీతోడ గూడి
ఇంతుల మెల్లరము
నేయి వెన్న మీగడలు
తీయని తీయని పాయసము
చేయి మునుగగా ఆరగింపగా
చేయవా! చిత్తగింపవా! ॥వేద॥

(హంసానంది రాగము – ఆది తాళము)

## 28

చీకాకు పడకు – చిడిముడి పడకు–
నీ కరుణ వినా మా కేమున్నది చెప్పు!
మా పున్నెము వలనగదా,
మా కోసమెగాదా! మా
గోపకులములో దిగి
గోవిందుడ వైనావు! ॥చీకాకు॥

గోవుల వెంబడి ఏవో
కోనల కానలలో, బడి
పోవు వట్టి వెఱ్ఱిగొల్ల
పొలతులము!

చిన్ని పేర పిలిచాము! ఎన్ని మాట లన్నాము!
ఎన్ని జన్మములదో ఈ వీడని మన బంధము:
ఇక దయచేయుము వరము పరవాద్యము!
॥చీకాకు॥

(సామరాగము – రూపకము తాళము)

## 29

ఒకటే కోరిక మా కిక
ఓ స్వామీ! గోవిందా!
మనసు నీకు తెలియదనా! (మా)
మనవి చేసుకొనుట! (ఈ)

తెలవారక మున్నే, దేవా, నీ సన్నిధి
చెలులము చేరి, నీ కొలువే కోరి,
సరస సుందరములు
సంపుల్ల సరోజములు నీ
చరణములకు మంగళా
శాసనమును చేయుట
ఒక పరవాద్యమున కనా?
ఓ స్వామీ గోవిందా! ॥ఒకటే॥

ఆల మేపి బ్రతికే ఈ
బేలలలో ఒకడవై
అవతరించు టేల? మా
అనుగవు కానేల?

ఈ బంధము నిలుపుము ఏ
దేడు జన్మముల కైన!
ఈ కైంకర్యము మానము
ఏనాటికి ఎప్పటికీ! ॥ఒకటే॥

(బేహాగ్ రాగము – రూపకము తాళము)

**30**

శుభ మగుగాత! సుఖ మగుగాత!
ఉభయ విభూతి నాయకుడౌ శ్రీ
విభుని, ప్రసన్న సులభుని దయచేత!
విలుపుత్తూరున వెలయు భట్ట నా
థులకూతురు ముప్పదులు తమిళకృతు
లలరుమాలగా నల్లె – అన్నిటిని
ఎలమి తవిలి పఠియించిన వారికి
శుభ మగుగాత! సుఖ మగుగాత!

నావలుగల వనధిని మథియించిన
శ్రీ వల్లభుని కేశవుని దరిసిన
ఆ విధువదనలు దివ్యాభరణలు
ఏ విధి వ్రతమూని ఏ వరమందిరొ
ఎరిగినవారికి ఇహపరములలో
శుభ మగుగాత! సుఖ మగుగాత!

కలితి పద్మాక్ష శిశిరమాలికా
విలసితుడౌ శ్రీ పెరియాళ్వారుల
తులసి మొలక, శూడి కొడుత నాంచారు
సెలవిచ్చిన ఈ తిరుప్పావై
ఎలమి తవిలి పఠియించినవారికి
శుభ మగుగాత! సుఖమగు గాత!

గిరులవంటి నాలుగు పెనుభుజములు,
అరుణనేత్రములు, శ్రీ ముఖమును గల
ఉభయ విభూతి నాయకుడౌ శ్రీ
విభుని ప్రసన్న సులభుని దయచేత ॥శుభము॥

(సౌరాష్ట్ర రాగము – ఆది తాళము)

## గుఙ్ఞానికి సన్మానం

బెజవాడలో కొందరు మిత్రులు ఒక సాహిత్య సంస్థను ఏర్పాటు చేశారు. ప్రతి సంవత్సరం ఉగాదినాడు ఒక మహాకవిని సత్కరించాలని నిర్ణయించుకున్నారు. మొదటి సంవత్సరం విశ్వనాథ సత్యనారాయణగారిని సన్మానించారు. ఆయన సంతోషించారు. రెండవ సంవత్సరం గుఙ్ఞం జాషువాగారిని సన్మానించాలని సభను ఏర్పాటు చేశారు. ఆ సభకు విశ్వనాథవారిని అధ్యక్షులుగా ఆహ్వానించారు. వారికి ఆ సంస్థవారు జాషువాను సన్మానించడం యిష్టంలేదు. లోపల కుతకుత ఉడికిపోతున్నారు. అధ్యక్షుని తొలిపలుకులలో చాలా కోపంగా ఆ సంస్థ నిర్వాహకుల్ని తిట్టడం మొదలుపెట్టారు. “వీళ్ళు శుద్ధబడుద్ధాయిలు. వీళ్ళకి ఏమాత్రం బుద్ధిలేదు. వీళ్ళకి గుఙ్ఞానికీ గాడిదకీ తేడా తెలియదు” అంటూ ఇంకా తిడుతున్నారు. వెంటనే జాషువాగారు లేచి, విశ్వనాథకు చేతులు జోడించి “అయ్యా! ఇప్పుడు గుఙ్ఞానికి సన్మానం చేస్తున్నారు!” అని కూర్చున్నారు. సభంతా గొల్లుమంది. విశ్వనాథవారు చిన్నబోయారు!
(–“ఆశుకవిశేఖర”, “అవధాన చక్రవర్తి” శ్రీ బులుసు వేంకటరామమూర్తిగారు చెప్పిన ఛలోక్తి – **తంగిరాల**)

# శ్రీకృష్ణదేవరాయలు - అష్టదిగ్గజకవులు

- ఆచార్య దివాకర్ల వేంకటావధాని

అష్టదిగ్గజములని ప్రసిద్ధిపడసిన మహాకవుల నాదరించి, వారిచే రసవత్తరములయిన మహాప్రబంధములు రచింపఁ జేసి, ఆంధ్రవాఙ్మయమున తనకాలము స్వర్ణయుగమై యలరారులనట్లొనరించిన సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు. ఇతఁడు క్రీ.శ. 1509 మొదలు 1530 వఱకును విజనగర సామ్రాజ్యమును పాలించెను. సంస్కృతమునకు భోజమహారాజువలె నాంధ్రమునకు ఈ మహారాజు అనన్య సామాన్యమైన అభ్యుదయమును కలిగించుటచే ఇతనికి ఆంధ్రభోజుఁడను సార్థకనామము కలిగినది. ఇతఁడు పలువురు పండితులను, కవులను పోషించుటయే కాక, తానుకూడ విద్వత్కవియై సంస్కృతాంధ్రములలో బహుగ్రంథములు రచించుట యితని కావ్యగీత ప్రియత్వమునకు తార్కాణము. ఇతఁడు స్వరచితమైన "ఆముక్తమాల్యద"యను ఆంధ్రప్రబంధమున అవతారికలో "మదాలస చరిత్ర, సత్యావధూ ప్రీణనము, సకల కథాసార సంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి" మొదలయిన సంస్కృత గ్రంథములను కూడ రచించినట్లు చెప్పుకొనియున్నాడు. కాని యందేవియు నిప్పుడు లభ్యములగుట లేదు.

**0. రాయల ఆముక్తమాల్యద**

రాయలు రచించిన ఆంధ్రప్రబంధము ఆముక్తమాల్యద. గోదాదేవి శ్రీరంగేశ్వరుల ప్రణయ వృత్తాంతమిందలి ప్రధాన వస్తువు. గోదాదేవి మొదట ధరించిన పూలమాలలు తరువాత శ్రీరంగేశునకర్పింపఁబడిన హేతువుచే ఆమెకు "ఆముక్తమాల్యద"అను పేరుగలిగినది. రాయలు సహజముగా వైష్ణవమతమునందు అభిమానము కలిగి, తన్మత ప్రచారము నందాసక్తి వహించినవాఁ డగుటచే, ఆముక్తమాల్యదయందు ప్రసక్తానుప్రసక్తముగా విష్ణుపారమ్యమును ప్రదర్శించు నుపాఖ్యానములు కొన్ని చేర్చియుండెను. ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము, యామునాచార్య చరిత్ర, మాలదాసరికథ యిందు ముఖ్యములైనవి. అవాంతర ప్రవేశితములైన ఈ కథలచేతను, యామునాచార్యునిచే కుమారునకు చెప్పించిన రాజనీతి విస్తారముచేతను, అతిదీర్ఘములయిన ఋతువర్ణనములచేతను, చివరి రెండాశ్వాసములలో తప్ప మిగిలిన వానిలో ప్రధానకథకు సంబంధించిన వృత్తాంతము మృగ్యమై యుండుటచేతను, ఈ ప్రబంధమున వస్త్వైక్యము నకు ఇంచుక భంగము వాటిల్లినదని చెప్పవచ్చును. ఇందలి కథావర్ణన పరిపాటిని పరికించినచో నిదియొక విష్ణు పురాణమువలె కనిపించును.

ఉపాఖ్యాన వర్ణనా విస్తృతులచే ప్రధానకథ మఱుగుపుచ్చఁబడినను, ఆముక్తమాల్యదకు ప్రబంధవాఙ్మయమున నున్నత స్థానము కల్పించు గుణవిశేషము లిందు పెక్కున్నవి. రాయలు వర్ణించిన గోదాదేవి విరహము ఇతర ప్రబంధము లందలి విరహవర్ణనకంటె విశిష్టమైన, ఐహికమును నీచమునైన మోహమును కాక, హార్దమును పవిత్రమునైన అనురాగమును ప్రకటించుచున్నది. ఇందలి ఋతువర్ణన ములను సూక్ష్మాతిసూక్ష్మ వివరములతో కూడి ఆయా ఋతువులను పఠితలకు ప్రత్యక్షము చేయుచు, రాయల ప్రకృతి పరిశీలన పాటవమును ప్రకటము కావించు చున్నవి. ఋతువుల నింత విస్తృతముగను, సహజ మనోహరముగను వర్ణించిన కవులు ఆంధ్ర వాఙ్మయముననే కాక సంస్కృతమున కూడ లేరనినచో నతిశయోక్తి

కాఁజాలదు. రాయల రాజనీతి వర్ణనము కేవల గ్రంథపఠన జన్యము కాక, అనుభవసిద్ధమగుటచే మిక్కిలి సహజమై అలరారుచున్నది.

ఉపాఖ్యానములను రచించుటలో రాయలు గొప్ప నేర్పు ప్రదర్శించెను. ఖాండిక్య – కేశిధ్వజోపాఖ్యానమును, మాలదాసరి కథయు, కథానిర్మాణ శిల్పమునకును, పాత్ర చిత్రణమునకును, సంభాషణ నైపుణ్యమునకు నెలవులై మిక్కిలి హృద్యములుగా నున్నవి. ఖాండిక్య–కేశిధ్వజులయు, మాలదాసరియొక్కయు, పాండ్యరాజుభార్యయొక్కయు శీలములు అతిపవిత్రములై ఆదర్శప్రాయములుగ నున్నవి. రాయలు మహారాజయ్యును ఇందు సామాన్యప్రజల గృహ జీవితమును, సుఖదుఃఖములను ప్రకృతియందలి వివిధ ప్రాణుల స్వభావములను చక్కగా వర్ణించియుండెను. ఆనాఁటి ప్రజాజీవితమునకు ఆముక్తమాల్యద ఆదర్శమై భాసిల్లుచున్నది.

ఆముక్తమాల్యదలో పలుచోట్ల రాయలకు వేద వాఙ్మయముతోడను, ఉపనిషత్తులతోడను, జ్యోతిరాది శాస్త్రములతోడను, పురాణములతోడను గల గాఢ పరిచయము వ్యక్తమగుచున్నది. విష్ణుచిత్తుఁడును, యామునాచార్యుఁడును అన్యమతములను ఖండించుచు విష్ణుమహత్త్వమును ప్రదర్శించునపుడు రాయలు బ్రహ్మసూత్రములనుండియు, ఉపనిషత్తులనుండియు పెక్కు వాక్యముల నుద్ధరించియుండెను. వైష్ణవమత రహస్యముల నెఱుంగుటకై అతఁడు ప్రస్థానత్రయమునే కాక దివ్య ప్రబంధములను కూడ క్షుణ్ణముగా పఠించినట్లు తోఁచును. ఆయా సందర్భములందు ఆతఁడు ప్రదర్శించిన కవిసమయ పురాణకథా పరిజ్ఞానము అచ్చెరువు కలిగించుచుండును.

ఆముక్తమాల్యద యందలి శైలి మిక్కిలి ప్రౌఢముగా నుండును. రాయలు దీర్ఘసమాసములను వాడుటయే కాక, పలుచోట్ల వాక్యయోజనయందును సంస్కృతభాషా సంప్రదాయమునే అనుసరించుచుండును. ఎడనెడ నందు ద్రావిడ పదములును, మాఱుమూల పదములును గూడ గోచరించును. అతఁడు చిన్న సమాసమున గంభీరమయిన యర్థము నిమిడింప యత్నించిన చోట్లు పెక్కుగలవు. అందుచేతనే ఈ కావ్యము పండితైక వేద్యమై సామాన్యులకు దురవగాహమగుట సంభవించినది. ఇట్లని రాయలు ఆముక్తమాల్యదలో సులభ జాతీయపదములను రమణీయముగా నుపయోగించినచోట్లు కొన్ని లేకపోలేదు. "కుంపటిలో తామర", "గుమ్మడికాయంత ముత్తెము", "ఇంటిలో నేదుముల్లు", "జక్కుల బోనంబు" మొదలగు చక్కని జాతీయములతోడను, నిసర్గ వర్ణనలతోడను గూడిన పద్యములు పెక్కతఁడు రచించియుండెను. కాని మొత్తము మీఁద ఆముక్తమాల్యదయందలి పాకము నారికేళపాక మనియే చెప్పనగును. తెలుఁగునందలి ప్రౌఢ ప్రబంధము లలో ఆముక్తమాల్యద ఉత్తమస్థానము నాక్రమించి, ప్రత్యేక గౌరవము నార్జించినదనుటలో నత్యుక్తి యుండఁజాలదు.

### 1. అల్లసాని పెద్దన

రాయల ఆస్థానమున అష్టదిగ్గజములను పేరుతో ఎనమండుగురు మహాకవులుండిరని ప్రసిద్ధి. వీరందఱును తెలుఁగుకవులే యని నిశ్చయముగా చెప్పజాలము. అప్పటి తెలుఁగుకవులలో వయసుచేతను, పాండిత్యము చేతను మొదట పేర్కొనదగినవాఁడు అల్లసాని పెద్దన్న (1475–1534). ఇతఁడు స్వారోచిష మనుసంభవమను మను చరిత్రను, హరికథాసారమను మఱియొక్క గ్రంథమును రచించెను. హరికథాసారము ఇంతవఱకు లభ్యము కాలేదు. పెద్దన మనుచరిత్రను రాయలవారికే అంకితము గావించెను. రాయలు పెద్దనను సమ్మానించిన విధము అనన్య సామాన్యమైనది. అతఁడా మహాకవిని కోకట గ్రామాద్యనేకాగ్రహారము లొసంగియు, గండపెండేరమును స్వయముగా కాలికి తొడిగియు, ఎదురైనచో తన

మదకరీంద్రము డిగ్గి కేలూత యొసఁగి ఎక్కించుకొనియు, పలు విధముల మన్నించుటయే కాక ఆంధ్ర కవితా పితామహయను బిరుదము నొసంగి యాదరించెను. ఆంధ్రదేశమున భారత భాగవతముల తరువాత మనుచరిత్రమునకే ప్రజాదరము హెచ్చు. అందుకు పెద్దన అందు ప్రదర్శించిన రచనా కౌశలమును, పాత్రపోషణ విధానమును కారణములు. అతఁడు మనుచరిత్రమునందలి కథను మార్కండేయ పురాణమునుండి గ్రహించి, వర్ణనాదులచే పెంచి చక్కనిప్రబంధముగా రూపొందించెను. ఇందు మొదటి రెండాశ్వాసములందును శృంగార రసాభాసముతో కూడిన వరూధినీ ప్రవరాఖ్యుల కథయు, తరువాత వరూధినీ గంధర్వుల సంభోగ శృంగారమును, పిమ్మట స్వరోచివృత్తాంతమును వర్ణింపఁ బడియుండుటచే నీ ప్రబంధమున వస్త్వైక్యము కొఱవడియున్నదని విమర్శకులు తలంతురు. ద్వితీయాశ్వాసమున శ్రోత్రియుఁడు, జితేంద్రియుఁడు అయిన ప్రవరుని శాంత ప్రవృత్తికిని, స్వేచ్ఛా చరిత్రయైన వరూధిని కామప్రవృత్తికిని సంఘర్షణము చక్కఁగా వర్ణింపఁబడినది. వరూధినీ ప్రవరుల పాత్రలను సజీవములుగా వర్ణించుటలో పెద్దన చాల నేర్పు ప్రదర్శించెను. ఈతని శైలి ప్రౌఢమై, ధారాశుద్ధిశోభితమై, ఎడనెడ జాతీయములతోడను, సామెతలతోడను గూడి "అల్లసానివాని అల్లిక జిగిబిగి" అను ప్రసిద్ధిని గడించినది. హిమవత్పర్వతమును, స్వరోచి వేఁటను, స్వరోచికిని రాక్షసునికిని జరిగిన యుద్ధమును వర్ణించుటలో పెద్దన ప్రకృతిపరిశీలనమును, సహజవర్ణనపాటవమును, భావనాశక్తియు వెల్లడియగును. యుద్ధవర్ణన సందర్భమున పెద్దన రసానుగుణముగా శబ్దాలంకారప్రీతిని, ఛందోవైవిధ్యమును ప్రకటించెను. మానవ హృదయమున జరుగు వివిధ భావసంఘర్షణములను వర్ణించుటలో నితఁడు దిట్ట. రాయల యాస్థానమున గండపెండేరమును గ్రహించుటకు ముందు చెప్పిన ఉత్పలమాలికనుబట్టి అతఁడు ఆశుధారాకవిత్వమున కూడ నేర్పరియని తెలియుచున్నది.

## 2. నంది తిమ్మన లేక ముక్కుతిమ్మన

రాయల దేవేరులలో నొకతె యయిన తిరుమలదేవితో నంది తిమ్మన అరణముగా వచ్చెనని చెప్పుదురు. ప్రస్తుతము వసుచరిత్రలో కనవచ్చు "నానాసూన వితానవాసనల" అను ముక్కును వర్ణించు పద్యమును భట్టుమూర్తి యితని నుండియే గ్రహించెననియు, అందుచే ఇతనికి "ముక్కు తిమ్మన" యను పేరు కలిగెననియు ప్రచారము కలదు. కాని యిందెంత సత్యమున్నదో చెప్పఁజాలము. ఇతఁడు రచించిన ప్రబంధము పారిజాతాపహరణము. ఇందు అవతారికలో మనుచరిత్రలో వలెనే కృతిభర్తయైన కృష్ణదేవ రాయలయు, తత్పూర్వులయు గుణగణములు, పరాక్రమాదులు విపులముగా వర్ణింపఁబడినవి. ఈ రెండు గ్రంథములలో కావింపఁబడిన రాయల దిగ్విజయములను బట్టి మనుచరిత్రము కంటె పారిజాతాపహరణమే ముందు రచింపఁబడియుండునని (1515) విమర్శకులు ఊహించుచున్నారు. పారిజాతాపహరణమునందలి కథ సంస్కృత హరివంశమునుండి గ్రహింపఁబడినది. తిమ్మన కథలో చేసిన మార్పులు చాలా తక్కువ. ఇందు కృష్ణుఁడు సత్యభామ ననునయించుచు ఆమెకు నమస్కరింపగా ఆమె తన యెడమకాలితో నాతని తన్నుటయు, అట్టి సందర్భమున కూడ కృష్ణుఁడు కుపితుఁడు కాక రసజ్ఞుఁడై, ఆమెతో సందర్భోచిత సరసనల్లాపము లొనరించుటయు ముఖ్యములైనవి. రాయలేదో కారణమున తిరుమలదేవిపై కోపించి ఆమెతో మాటాడుట మానివేయగా, ఆతనికి ప్రియానునయ విధానమును ప్రబోధము కావించుటకై తిమ్మన అమూలకమైన యీ ఘట్టములను కల్పించెనని చెప్పుదురు. పారిజాతాపహరణమునందలి ప్రథమా

శ్వాసము శృంగారరసపూరితమై మిక్కిలి మనోహరముగా నుండును. ఇందు సత్యభామ ప్రౌఢత్వమును, మానినీత్వమును చక్కఁగా వర్ణింపఁబడినవి. తక్కిన ఆశ్వాసములలో చంద్రోదయ, సూర్యోదయ, ప్రయాణ, వనవిహార యుద్ధాదులు ప్రబంధోచితముగా వర్ణితములై యున్నవి. ప్రకృతివర్ణనమున తిమ్మన చాల మెలఁకువ చూపెను. పారిజాతాపహరణ ప్రబంధమున చివర పుణ్యకవ్రత వృత్తాంతము కలుపుట అనావశ్యకమని కొందఱందురు. తిమ్మనశైలి మృదుమధురమై ఎక్కడను కుంటుపడక, మకరంద ప్రవాహమువలె సాగిపోవును. అందుచేతనే "ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు" అను నానుడి కలిగినది. ఈతని వర్ణనలు భావగంభీరములును, ఔచిత్య శోభితములునై యొప్పారును. కాని, ద్వితీయ తృతీయాశ్వాసములందరి వర్ణనలు అతిదీర్ఘములై కథా గమనమున కించుక ఆటంకము కలిగించుచున్నవి. మృదువులైన శృంగారభావములను రసానుగుణమైన శైలిలో మనోహరముగా వర్ణించుటలో ముక్కు తిమ్మన కృతహస్తుఁడు.

### 3. మాదయగారి మల్లన

మాదయగారి మల్లన కూడ రాయలవారి ఆస్థాన మందే ఉండినట్లు రాయవాచకమువలన తెలియుచున్నది. ఇతఁడు రాజశేఖరచరిత్రమను ప్రబంధమును రచించి, తిమ్మరుసుమంత్రి కల్లుఁడయిన నాదెండ్ల అప్పామాత్యున కంకితము చేసెను. హేమధన్వుని కుమారుఁడయిన రాజశేఖరుఁడు, సింధురాజు కూఁతురైన కాంతిమతిని వివాహమాడుట ఇందలి ఇతివృత్తము. ఇందలి కథాకల్పనలో వైచిత్రి అంతగా కానరాదు. రాజశేఖరునకును కాంతిమతికిని కాళికాదేవి ఇచ్చిన చిలుక నడిపిన రాయబారము రమ్యముగా నుండును. పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నము నందలి శుచిముఖి ఈ చిలుకకు శిష్యురాలని చెప్పవచ్చును. రాజశేఖర చరిత్ర పరిమాణమున చిన్నదయ్యును మిక్కిలి రసవంతముగా నుండును. రసవంతముగా కవిత్వము చెప్పఁజాలనిచో అసలు కవిత చెప్పకయే యుండుట మేలని మల్లన వ్రాక్రుచ్చెను. ఈతని గ్రంథమున వర్ణనలు నాతిదీర్ఘములును, ఔచిత్య పూరితములునై యుండును. శృంగార రసవర్ణమున కూడ ఇతఁడు చాల నిగ్రహము ప్రదర్శించెను. ఈతని శైలి ప్రసాదగుణ భూయిష్ఠమై ముద్దులొలుకుచుండును. పాత్రోచితముగను సహజముగను భావములను వర్ణించుటలో నితఁడు కడు నేర్పరి.

### 4. ధూర్జటి

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేలకల్గె నీ యతులిత మాధురీ మహిమ" అని రాయలవారిచే ప్రశంసింపఁబడిన ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తి మాహాత్మ్యమను క్షేత్రమాహాత్మ్యమును రచించెను. శ్రీకాళహస్తీశ్వర శతకమితఁడు రచించినదా? కాదా? అని కొందరు సందేహించుచున్నారు. కాని కవితా ధోరణిని బట్టి చూడ అది ఈతని కృతియే యని తోఁచుచున్నది. ఈ శతకము ఆంధ్రశతకవాఙ్మయమునకు తలమానికమని చెప్పఁదగినది. ఇందు కవి పూర్వజీవితమున తాను గడపిన వర్తనమునుగూర్చి అనుతాపమును వెల్లడించుచు ఆత్మపరీక్ష కావించుకొని యున్నాఁడు. మదాంధులైన రాజుల యుద్ధనీతిని, వారి వనితాసక్తిని, భోగభాగ్యములను అందతఁడు నిరసించిన విధము చూడ, వయస్సు పరిణతమగు కొలదిని అతఁడు విషయపరాఙ్ముఖుడై వైరాగ్య తత్పరుడఁగుట తోఁచుచున్నది. ఇందలి శైలి ప్రౌఢమై, యెడనెడ స్వతంత్ర ప్రయోగములతోఁ గూడి, అత్యంత రమణీయముగా నున్నది. ఇందలి పెక్కు పద్యములు ధూర్జటి శివభక్తి విశేషమును వెల్లడించుచున్నవి. తాను రచించిన శ్రీకాళహస్తి మాహాత్మ్యము నీతఁడు శివునికే అర్పించెను.

అందు దక్షిణ కైలాసమని ప్రసిద్ధిగన్న శ్రీకాళహస్తి క్షేత్ర మహాత్త్వమును దెల్పు కథలు వర్ణింపఁబడినవి. సంస్కృతమున స్కాందపురాణమునఁగల శ్రీకాళహస్తి మాహాత్త్యమే దీనికి మూలము. ఇందు మానవులేకాక తిర్యక్కులు కూడ శివభక్తిని ప్రదర్శించి కైవల్యము నందజాలుట వర్ణింపఁబడినది. ఇందలి కథలలో భక్తి పరవశుఁడై శివునికి తన రెండు కన్నులను పెరికి యిచ్చిన తిన్నఁడను పులింద రాజకుమారుని కథయు, మహాకవియై శివుఁడు వ్రాసిన పద్యములలో కూడ తప్పుపట్టిన నత్కీరుని కథయు, రసపూరితములై అతిమనోహరముగా నుండును. ధూర్జటి శైలి సమాస భూయిష్ఠమయ్యును ఎడనెడ లలితపద కోమలమై, రసానుగుణ పదప్రయోగముతో కూడి సహృదయ రంజకముగా నుండును. ఈ కావ్యమునందలి వర్ణనలు మిక్కిలి సహజములై, కవి ప్రకృతి పరిశీలనా పాటవమును వెల్లడించుచున్నవి. తిన్ననికథయందలి ఆటవిక జీవిత వర్ణనమును, నత్కీరునికథయందలి దుర్భిక్ష వర్ణనమును, స్వర్ణముఖీ ప్రవాహ వర్ణనమును ఇందుకు నిదర్శనము. ధూర్జటి పోతనాదులవలె కవిత్వమొక దివ్యకళా విశేషమనియు, దాని నీశ్వరారాధనమునకే వినియోగించుట యుక్తమనియు తలంచిన మహనీయుఁడు.

### 5. అయ్యలరాజు రామభద్రకవి

అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయమను కావ్యమును వ్రాసి రామరాయల మేనల్లుఁడైన గొబ్బూరి నరసరాజునకు అంకితము కావించెను. ఇతడు రాయలు సంస్కృతమున వెలయించిన సకల కథాసార సంగ్రహమును తెలిఁగించి ఆతనికే అంకితము చేయఁదలఁచెనని చెప్పుదురు. ఈ గ్రంథమిప్పుడు లభ్యమగుట లేదు. రామభద్రుఁడు రామాభ్యుదయమున రామాయణకథను ప్రబంధరీతిని రచింపఁ దలఁచినవాఁడగుటచే అందు ఉద్యాన విహార, పుష్పాపచయ, జలక్రీడాదులగు ప్రబంధోచితములగు వర్ణనలు ప్రవేశపెట్టెను. అవి మనోహరముగనే యున్నను కొన్ని చోట్ల ఔచిత్య దూరములుగా నున్నవి. విశ్వామిత్రమహర్షి సీత సౌందర్యమును వర్ణించు పట్లను, ఋష్యశృంగుని కథలో వేశ్యల మాయలను విభ్రమములను వర్ణించు పట్లను, ఇతఁడు కొంచెము మేర మీఱినట్లు కానిపించును. ఇతని రచన ప్రౌఢమైన సంస్కృత సమాసములకును, లలిత కోమలములైన తెలుఁగు పదములకును నెలవై మనోహరముగా నుండును. ఇతనికి శ్లేష, యమకము, అనుప్రాసాది శబ్దాలంకారములందును, చిత్రకవిత్వ మందును ప్రీతిమెండు.

### 6. పింగళి సూరన (క్రీ.శ. 1550-1625)

పింగళి సూరనార్యుడు కూడ అష్టదిగ్గజములలోని వాఁడే అని లోకమున వాడుక. కాని అతఁడు క్రీ.శ. 16వ శతాబ్ది ఉత్తరార్ధమున జీవించెనని కొందఱను, 17వ శతాబ్ది మొదటి పాదము వఱకు ఉండెనని కొందఱును చెప్పుచున్నారు. రాఘవ పాండవీయము, కళా పూర్ణో దయము, ప్రభావతీ ప్రద్యుమ్నము అను నితని మూఁడు రచనలు మాత్రమే ఇప్పుడు ఉపలభ్యములగు చున్నవి. ఇతఁడు తాను వ్రాసితినని చెప్పుకొన్న గరుడ పురాణము నష్టమైనది. సూరన మిక్కిలి ప్రతిభావంతుఁడు. ఇతని కావ్యములు మూఁడును క్రొత్తఁదనముతో విలసిల్లుచు అతని పాండిత్య ప్రతిభా కళాభిజ్ఞతలు చాటుచున్నవి.

రాఘవ పాండవీయము ద్వ్యర్థికావ్యము. వేములవాడ భీమకవి యిట్టి కావ్యమొకటి వ్రాసెనని ప్రతీతి కలదు. కాని అది లభ్యమగుట లేదు. ఇందు రామాయణ భారత కథలు రెండును జోడింపబడినవి. ఇది చదువునప్పుడు పఠిత యెట్టి క్లేశమును లేకుండఁగనే ఒకసారి రామాయణ కథను, ఒకసారి భారతకథను స్పష్టముగా గ్రహింపజాలును. సూరన ఇందు వివిధములయిన శ్లేషలను వాడి

సంస్కృతాంధ్రములందు తనకుఁగల పాండిత్య విశేషమును ప్రకటించెను. సామాన్యముగ ద్వర్థికావ్యములందు రసభావౌన్నత్యము ప్రకటించుటకు అంతగా నవకాశ ముండదు. కాని సూరన యిందు కావించిన కొన్ని వర్ణనములందును, ప్రకటించిన భావములందును సామాన్య కావ్యములందు వలెనే కవిచమత్కారమెంతో కనఁబడు చున్నది. ఈ కావ్యము నతఁడు ఆకువీటి పెద్ద తిమ్మరాజునకు అంకితము కావించెను.

సూరన కీర్తిసౌధమునకు మూలస్తంభమని చెప్పఁదగినది కళాపూర్ణోదయము. ఇది కల్పిత కథావస్తుకమైన అద్భుత కథాకావ్యము. ఇంతకు పూర్వము ప్రఖ్యాత వస్తుకములైన కావ్యములనే కాని, ఇట్లు కల్పిత కావ్యములను వ్రాసిన కవులెవ్వరును లేరు. ఇందు కలభాషిణియను వేశ్య నాయిక. ఇందలి కథాకల్పనా చాతుర్యము అప్రతిమానమైనది. సూరన కథాకథనమున నిందు కాలక్రమపద్ధతిని గాక, నవలలోవలె కార్యకారణ పద్ధతి నవలంబించి, కథామధ్యవృత్తాంతముతో కావ్యము నారంభించును. ఇందాతడు శృంగార రసమునకు సంబంధించిన వైవిధ్యమును, వివిధ మనః ప్రవృత్తులను చక్కగా ప్రదర్శించెను. ఈతడు రచించిన సుగాత్రీ శాలీనుల కథ అమలిన శృంగారమున కాలవాలమై అతి రమణీయముగా నుండును. మాయా సత్య రంభా నలకూబరుల కథలో నీతఁడు చూపిన చమత్కార మద్భుతావహముగా నుండును. మాయా సత్య రంభల వాగ్వివాద మెంతో సహజమై, సవతుల స్వభావమును స్పష్టము చేయుచున్నది. ఇచట సంఘటనము ఆంగ్లనాటక కవిసార్వభౌముఁడైన షేక్స్పియరు 'కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్సు' లోని సంఘటనమును పోలియుండునని విమర్శకుల అభిప్రాయము. పాత్ర నిర్మాణమునను, రసపోషణమునను, ఇందు సూరన చూపిన నేర్పు అనన్యసామాన్యమైనది. ఇట్లు కల్పిత కథాకావ్యమును అద్భుతముగా సృష్టించియు నతఁడు చివరి ఆశ్వాసములలో మధురలాలసా కళాపూర్ణుల శృంగారమును వర్ణించుపట్ల సాధారణ ప్రబంధపద్ధతినే అవలంబించెను. ఈ కావ్యమును అతఁడు నంద్యాల కృష్ణరాజునకు అంకితము చేసెను.

ప్రభావతీ ప్రద్యుమ్నమున శ్రీకృష్ణుని కుమారుఁడగు ప్రద్యుమ్నుఁడు, వజ్రనాభుఁడను రాక్షసరాజు కుమార్తెయగు ప్రభావతిని వలచి పరిణయమాడిన కథ వర్ణింపఁబడినది. ఇది శ్రవ్యప్రబంధమే యయ్యును ఇందలి కథ యంతయు పాత్రల సంవాదరూపమున సాగుటచే ఒక దృశ్యకావ్యము వలె కనిపించును. ప్రభావతీ ప్రద్యుమ్నుల నడుమ ప్రణయ దౌత్యము నడిపిన శుచిముఖి యను రాజహంస వాక్చాతుర్యమును, కార్యసాధన కౌశలమును వర్ణించుటలో సూరన అప్రతిమానమైన నేర్పు ప్రదర్శించెను. అతఁడీ చక్కని ప్రబంధమును తన తండ్రి పేర నంకితము కావించి అపూర్వమైన పితృభక్తిని వెల్లడించెను.

సూరన మహాపండితుఁడు. కథ రసానుగుణముగా నితని శైలి ప్రౌఢత్వము నొందుచుండినను సాధారణముగా మృదుమధురమై సరళగతినే నడుచుచుండును. జాతీయములను, సామెతలను వాడుటలో ఇతఁడు కడు నేర్పరి. సంభాషణముల నడుపుటయందును, పాత్రల చిత్తవృత్తుల చిత్రించుటయందును, ఈతఁడు తిక్కన సోమయాజికి సాటికాఁజాలును. శ్లేషరచనయందీతఁడు అద్వితీయుఁడు. ప్రతిభావంతులైన ఆంధ్రమహాకవుల శ్రేణిలో సూరనకు ఉన్నతమయిన స్థానము కలదు.

**7. రామరాజభూషణుఁడు లేక భట్టుమూర్తి**

రామరాజభూషణుఁడను బిరుదనామముగల భట్టుమూర్తి కూడ అష్టదిగ్గజములలో నుండెనో లేదో చెప్పజాలము. కృష్ణదేవరాయల అల్లుడైన అళియ రామరాయల కొలువున కీతఁడు భూషణమై ఉండుటచే ఇతనికి "రామరాజ భూషణుఁడు " అను బిరుదు కలిగినది.

ఇతని మొదటి పేరు "మూర్తి" అనియు, "భట్టు" కులమువాఁడగుటచే "భట్టుమూర్తి"యను ప్రచారము కలిగెననియు చెప్పుదురు. ఇతఁడు గొప్ప పండితుఁడు. అవధానములందును, ఆశుకవిత్వమునందును ఆరితేరినవాఁడు. ఇతఁడు మొదట హనుమంతునికి, తరువాత శ్రీరామచంద్రునికి భక్తుఁడు. "సంగీత కళారహస్యనిధి". ఇతని రచనలో నితనికిగల బహుశాస్త్ర పాండిత్యము వ్యక్తమగును.

ఇతఁడు" నరసభూపాలీయ"మను నామాంతరముగల "కావ్యాలంకార సంగ్రహము"ను, "హరిశ్చంద్ర నలోపాఖ్యాన"మను ద్వ్యర్థికావ్యమును, "వసుచరిత్ర"మను మహాప్రబంధమును రచించెను. ఇందు మొదటిది సంస్కృతమున విద్యానాథుడు రచించిన "ప్రతాపరుద్ర యశోభూషణము" ననుసరించి వ్రాయఁబడిన లక్షణ గ్రంథము. ఇందు కావ్యధ్వని రసాలంకారములను గూర్చియు, నాయికానాయకులనుగూర్చియు, గుణ దోషములనుగూర్చియు వివరింపఁబడినది. ప్రతాపరుద్ర యశోభూషణమునందున్న నాటకప్రకరణమిందు లేదు. అందు లక్ష్యము లన్నియు ప్రతాపరుద్రవర్ణన పూర్వకములై యుండ, నిందు అళియ రామరాయల మేనల్లుఁడును, ఓబయరాజు కుమారుఁడును అగు నరసభూపాలుని వర్ణించునట్టివిగా నున్నవి.

భట్టుమూర్తి రచనలలో శ్రేష్ఠమైనదియు, ఆంధ్ర వాఙ్మయమున కలంకారమని చెప్పదగినదియు నగు ప్రబంధము "వసుచరిత్రము". ఇది రామరాయల తమ్ముఁడును, తాళికోట యుద్ధమైన పిమ్మట విజయనగర రాజ్యము నేలినవాఁడును అగు తిరుమలరాయల కంకితము చేయఁబడినది. వసుమహారాజు శుక్తిమతీ–కోలాహల పర్వతముల పుత్రికయైన గిరికను వలచి పెండ్లియాడిన వృత్తాంతము ఇందలి వస్తువు. భట్టుమూర్తి కథను మహాభారతమునుండి గ్రహించి, యెడనెడ వర్ణనములను చేర్చి, ఈ మహాప్రబంధమును నిర్మించెను. ఇందు కథా రామణీయకమంతగా కానరాదు కాని కవితా పాండిత్య ప్రకర్షయందును, భావోన్నతియందును, రసపోషణము నందును, శ్లేషధ్వని కల్పనయందును ఇది అద్వితీయముగా నుండును. ప్రబంధ లక్షణము లన్నియు ఇందు కాననగును. ద్వితీయాశ్వాసమున శుక్తిమతీ కోలాహలుల వృత్తాంతము వర్ణించుపట్ల భట్టుమూర్తి చూపిన కవితా చమత్కారమును, నాయికానాయకత్వారోపణమును అద్భుతముగా నుండును. తృతీయాశ్వాసమునందలి విరహాది వర్ణనలు అనన్య సామాన్యములు. లతికాసంవృతగాత్రుడైన వసురాజు కపట ముని వేషధారియగు తన నర్మసఖుని సూచన ననుసరించి బయల్పడు పట్టున దృశ్యకావ్య లక్షణములు గోచరించును. ఇందలి ప్రకృతివర్ణనలు సహజసుందరములై యుండును. భట్టుమూర్తి శైలి ప్రౌఢమయ్యు మృదుమధురమై సంగీతమున కనువుగా గోచరించును. లలనాజనాపాంగేత్యాది సీసపద్యముల నడక అత్యంత హృద్యముగా నుండును. వసుచరిత్ర సంస్కృతమునకు గూడ ననువదింప బడుటయే దాని యౌత్కృష్ట్యమునకు తార్కాణము. ఆంధ్రప్రబంధ వాఙ్మయ తారహారమునకిది నాయకమణియని చెప్ప వచ్చును. తరువాతి కవులెందరో దీని ననుసరించి యుండుటచే వారి రచనలకు "పిల్ల వసుచరిత్ర"లను పేరు కలిగినది.

హరిశ్చంద్ర నలోపాఖ్యానమను ద్వ్యర్థికావ్యము ఈతని తుది రచన. ఇందు నల–హరిశ్చంద్ర మహారాజుల కథలు చక్కగా జోడింపబడినవి. రామాయణ భారత కథలకువలె ఈ రెండు కథలకును సన్నివేశ సామ్యమంతగా లేకపోయినను, భట్టుమూర్తి తన అపూర్వ పాండత్య ప్రతిభా విశేషములచే అద్భుతమైన శ్లేష కూర్చి, వాని నేకసూత్రమున సంధింపఁజాలెను. ఇతని శ్లేషసంఘటన వైఖరిని, పాండితీ వైభవమును చూచి అచ్చెరువు పొందనివారుండరు. శ్లేష

కావ్యమయ్యును ఇందలి వర్ణనలు సహజసుందరములును, రసవంతములునునై యొప్పారును. ఈ కావ్యము ప్రారంభమున భట్టుమూర్తి భక్తిభావము లెస్సగా వ్యక్తము చేయబడినది.

**8. తెనాలి రామకృష్ణుడు**

అష్టదిగ్గజములలోని వాఁడుగా ప్రసిద్ధినందియు రాయలకాలమున ఉండెనా లేదా అను సందేహము కలిగించువారిలో తెనాలి రామకృష్ణుఁడొకఁడు. ఈతని చాటువులును, హాస్యోక్తులును ఆంధ్రదేశమున చాల ప్రచారము పొందినవి. ఈతఁడు రచించిన గ్రంథములు రెండు – ఉద్భటారాధ్య చరిత్రము, పాండురంగ మాహాత్మ్యము. ఉద్భటారాధ్య చరిత్రము శైవప్రబంధము. దీనిని రచించిన రామలింగకవి రామకృష్ణునికంటె భిన్నుఁడని కొందరందురు. కాని, ఇతఁడే మొదట రామలింగఁడయ్యు, తరువాత వైష్ణవమును స్వీకరించి రామకృష్ణుఁడయ్యెనని తోఁచుచున్నది. అప్పుడు కూడ శైవమన్న నాతనికి వైముఖ్యము లేదు.

పాండురంగ మాహాత్మ్యము భీమానదీ తీరము నందలి పుండరీక క్షేత్ర మహత్త్వమును వర్ణించు క్షేత్రమాహాత్మ్యము. ఇందలి కథ స్కాందపురాణమునుండి గ్రహింపబడినది. క్షేత్రము, తీర్థము, దైవము అను మూఁడును ఉదాత్త ములైయుండు ప్రదేశమేది? అను ప్రశ్నకు ఉత్తరముగా ఇందలి కథ చెప్పఁబడినది. ఇందలి ద్వితీయాశ్వాసము నందు పుండరీకుఁడను పరమభక్తాగ్రేసరుని వృత్తాంతము అతి రమణీయముగా నుండును. పాండురంగ క్షేత్ర మాహాత్మ్యమును సూచించు నితరకథలెన్నియో యిందు గలవు. వానిలో నిగమశర్మకథయు, సుశీలకథయు, ముఖ్యములైనవి. వీనియందును, ఆయుత నియుతుల కథయందును రామకృష్ణుఁడు చూపిన కథాకథన కౌశలము మిక్కిలి రమ్యముగా నుండును. పాండురంగమాహాత్మ్యము కడుంగడు ప్రౌఢమయిన ప్రబంధము. దీర్ఘసంస్కృత సమాసములతోడను, అపరిచిత పదప్రయోగముల తోడను కూడి ఇందలి శైలి పఠితకు కొంత క్లేశము కలిగించును. ఇట్లని రామకృష్ణుఁడచ్చటచ్చట ముచ్చట గొల్పు తెలుగు రచన సాగింపకపోలేదు. ఈ కథాకావ్యమున పెక్కు సామెతలును, జాతీయములును సందర్భోచితముగా పొదుగఁబడినవి. గంభీరభావప్రకటనమందును, రస పాత్రపోషణమునందును రామకృష్ణుఁడు మిక్కిలి నేర్పరి.

**ఆరుద్రగారి ఛలోక్తి-1**

ఒకసారి ఆరుద్రగారు ఒక సభలో ప్రసంగించటానికి రాజమండ్రి వచ్చారు. వారికి గవర్నమెంటు గెస్ట్‌హౌస్‌లో బస ఏర్పాటుచేశారు సభానిర్వాహకులు. సాహిత్య ప్రియుడు ఉత్సాహవంతుడు అయిన ఒక యువకుడు ఆరుద్రగారిని చూడటానికి గెస్ట్‌హౌస్‌కి వడివడిగా వచ్చాడు. అతడు అంతకుపూర్వం ఆరుద్రగారిని ఎప్పుడూ చూడలేదు. ఇదే మొదటిసారి. మాసిపోయిన గడ్డం, కాషాయిరంగు పైజమా, అదేరంగు లాల్చీ తొడుక్కుని, మిక్కిలి నిరాడంబరంగా ఉన్న ఆరుద్రగారు, గెస్ట్ హౌస్ ముందు పచార్లు చేస్తున్నారు. ఆయన్ని చూసి ఆ యువకుడు "ఆరుద్రగారు ఉన్నారా?" అని ఉత్సాహంగా అడిగాడు. "నేనే ఆరుద్రను నాయనా!" అన్నారు ఆరుద్ర. మిక్కిలిగా ఆశ్చర్యపోయిన ఆ యువకుడు గోదావరి మాండలికంలో "అయ్యబాబోయ్! మీరాండీ? నేనెవరో ఇక్కడి వాచ్‌మన్ అనుకున్నానండి బాబూ!" అన్నాడు గట్టిగా. "మనసులో అనుకుంటే అనుకున్నావు నాయనా! పైకి నాతో చెప్పడం ఎందుకు?" అన్నారు ఆరుద్ర వేదాంతిలా ముఖంపెట్టి. (**–తంగిరాల**)

# వాలివధ - వాల్మీకి తీర్పు

**- డా॥ చన్నాప్రగడ తిరుపతిరావు**

(1972-73 సంవత్సరాలలో ప్రసిద్ధ సాహిత్య మాసపత్రిక 'భారతి'లో వాల్మీకి రామాయణంలోని 'వాలివధ'ను గురించి వరుసగా నాలుగు వ్యాసాలు వచ్చాయి. వీటిలో మొదటి రెండు వ్యాసాలూ చాలా చిన్న వ్యాసాలు. నిజానికి ఇవి వ్యాసాలు కావు; పరిశీలనాత్మకమైన అభిప్రాయాలు మాత్రమే! అందువల్లనే ఇవి 'భారతి'లో 'కలగూరగంప' అనే శీర్షికలో వచ్చాయి. మూడు, నాలుగు వ్యాసాలు పెద్దవ్యాసాలు. ఇవి 'భారతి'లో ప్రధాన వ్యాసాలుగా వచ్చాయి. ఈ నాలుగు వ్యాసాలలో రెండవది- మొదటిదానికి ఖండన; నాల్గవది- మూడవ దానికి ఖండన. వీటిలో సునిశితమైన, లోతైన విమర్శతోకూడినది డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారి 'వాలివధ - వాల్మీకి తీర్పు" అనే మూడవ వ్యాసం. దానిని ఇక్కడ ఇస్తున్నాను. **- సంపాదకుడు**)

'వాలి వధ - ఒక పరిశీలన' అనే శీర్షికతో భారతి 1972 ఫిబ్రవరి సంచికలో శ్రీ కాళూరి హనుమంతరావు గారు కొంత మీమాంస చేశారు. 'వాలి వధ సందర్భంలో రాముడు అనుసరించింది రాజనీతినే గాని ధర్మమును కాదని' వారు అభిప్రాయపడినారు. భారతి 1972 జూన్ సంచికలో శ్రీ వి.ఏ. కుమారస్వామిగారు కాళూరివారి వాదాన్ని ఖండిస్తూ, రాముడు రాజధర్మాన్నే పాటించాడని సమర్థించారు.

రాముడి ఈ చర్యలోని ధర్మాధర్మములను గురించిన మీమాంస రామాయణంలోనే ప్రారంభమైంది. రాముడిని సాధారణ మానవవ్యక్తిగాకాక భగవదవతారంగా భావించటంతో నిష్పక్షపాతమైన విమర్శాదృష్టి మందగించి, అసంబద్ధములైన వాదములతో, ఎలాగో రాముడి చర్యను సమర్థించటమే తమ ధర్మంగా పండితులు భావిస్తూ వచ్చారు. కుమారస్వామిగారి వాదం కూడా దాదాపు అదే ధోరణిలో సాగింది. ఈ ఇరువురు వ్యాసకర్తలు గమనింపకుండా వదలిన మరికొన్ని అంశాల్ని వ్యక్తం చేయటం ఈ వ్యాసపు ఉద్దేశం.

రామాయణంలో చెప్పబడిన వాలివధ కథ ప్రక్షిప్తమై యుంటుందనీ, భారతంలోని రామోపాఖ్యానంలో చెప్పబడిన కథయే వాస్తవమై ఉంటుందనీ కాళూరివారు అభిప్రాయ పడినారు. 'ఉన్న శ్లోకములను ఉన్నట్లుగా తీసుకొని శ్రీరాముని సత్యమును తెలియుటయే మన కర్తవ్య'మని కుమారస్వామిగారంటున్నారు. నేను కూడా ఈ విషయంలో కుమారస్వామిగారి వాదాన్నే స్వీకరించి - ప్రస్తుతానికి ప్రక్షేప సమస్య నలాఉంచి - వాల్మీకి రామాయణంలో ప్రస్తుతం మనకు కనిపిస్తూన్న కథనాన్ననుసరించే ఈ సమస్యను పరిశీలించదలచుకొన్నాను.

కుమారస్వామిగారు వారు రాముడి చర్యను సమర్థించటానికి భవభూతి రచితమైన మహావీరచరిత్రలోని కథనాన్ని ఉదాహరించారు. నాయకుడి చరిత్రలోని అనుచితాన్ని తొలగించేందుకు నాటకకర్తలు అన్యథా ప్రకల్పనలు చేస్తుంటారు. ఆయా కల్పనలు ఆ నాటక కర్త కల్పనాశక్తికి ద్యోతకము లవుతవేకాని, మూలగ్రంథమందలి నాయకుడి చరిత్రలో ఉన్న దోషాన్ని పోగొట్టలేవు. పైగా నాటకకర్త ఈ విధమైన మార్పుచెయ్యటం అవసరమని భావించటంలోనే మూలంలోని కథలో నాయకుడి చరిత్ర దోషభూయిష్ఠంగా ఉన్నదని అంగీకరించినట్లవుతున్నది. కనుకనే కాళూరివారు ఉదాహరించిన అభిషేక నాటకం లాగే కుమారస్వామిగారు ఉదాహరించిన మహావీర చరిత్ర కూడా ఈ మన మీమాంసకు ఉపయోగించదు. వాల్మీకి రామాయణ మొక్కటే ప్రమాణం.

వాల్మీకి రామాయణాన్నిబట్టి స్వయంగా వాలియే రాముడి చర్యను ఆక్షేపించాడు. దానికి రాముడు ఏదో

సమాధానం చెప్పాడు. 'వాలి శ్రీరాముడి సమాధానంతో తృప్తిపడి తనువు చాలించాడు.' కనుక 'వాలికొరకు జాలి పడవలసిన అవసరం లేద'ని కుమారస్వామిగారంటున్నారు. ఏ పరిస్థితిలో వాలి తన సంతృప్తిని వెల్లడించాడో గమనిస్తే, అతడు వెల్లడించిన సంతృప్తి హృదయపూర్వకమైనది కాదని గుర్తింపగలము.

ధర్మంగానో, అధర్మంగానో తాను బాణవిద్ధుడైనాడు. తనకు మృత్యువు ఆసన్నమై ఉన్నది. తన వెనుక బాలుడైన అంగదుడిని రక్షింపగల దక్షులెవరూ లేరు. అంగదుడు సుగ్రీవ శ్రీరాముల దయాదాక్షిణ్యములపై ఆధారపడి జీవించవలసినవాడైనాడు. తాను రామ సుగ్రీవుల యెడల విరోధ బుద్ధితోనే మరణిస్తే, తన అనంతరం తన కుమారుడికి కూడా తనకు పట్టిన గతే పడుతుంది. రాజ్యంకొరకు అన్ననే చంపిన (లేక చంపించిన) సుగ్రీవుడికి అంగదుడిని చంపటం విషయంలో ఎలాంటి సంకోచాలూ ఉండవు. అందుచేత నిస్సహాయుడైన తన ప్రియపుత్రుడి భవిష్యత్తును ఆలోచించి, అతడి క్షేమాన్ని కోరి, తన అపరాధాన్ని అంగీకరించటం ద్వారా శ్రీరామ సుగ్రీవుల కరుణను సంపాదించేందుకే వాలి తన నేరాన్ని అంగీకరించాడు. వాలికి అంగదుడంటే ఎంతటి ప్రాణాధికమైన ప్రేమయో అతడి మాటల్లోనే చూడండి:

**న చాత్మానమహం శోచే న తారాం నాపి బాంధవాన్**
**యథాపుత్రం గుణజ్యేష్ఠ మంగదం కనకాంగదమ్.**
**స మమాదర్శనాద్దీనో బాల్యాత్ప్రభృతి లాలితః**
**తటాక ఇవపీతాంబు రుపశోషం గమిష్యతి.**
**బాలశ్చాకృతబుద్ధిశ్చ ఏకపుత్రశ్చ మే ప్రియః**
**తారేయో రామ భవతా రక్షణీయో మహాబలః.**

(కిష్కింధ - 18వ సర్గ - 52-54 శ్లో.)

(నన్ను గురించి నాకు దుఃఖం లేదు; తారను గురించీ లేదు; బంధువులను గురించీ లేదు. నా దుఃఖమంతా నా కుమారుడైన అంగదుడిని గురించే. చిన్నతనం నుండి ఎంతో గారాబంగా పెరిగినవాడు. నేను కనిపించక పోవటంతో నీళ్ళులేని చెరువులాగ శుష్కించి పోతాడు. వాడు చిన్నవాడు; అమాయకుడు; నాకు ఒక్కగాని ఒక్క కొడుకు; నాకు ప్రాణమైనవాడు. బలవంతుడే, ఐనా, రామా, వాడిని నీవే రక్షించాలి.)

అంగదుడికి వాలిచేసిన కడపటి హితోపదేశం వల్ల అతడి హృదయంలోని భావం వ్యక్తమవుతున్నది.

**దేశకాలౌ భజస్వాద్య క్షమమాణః ప్రియాప్రియే**
**సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ.**

(కిష్కింధ-సర్గ 22. శ్లో.20)

(దేశకాలాలను గుర్తించి జీవించు. ప్రియాప్రియాలను ఓర్చుకో; సుఖదుఃఖాలను సహించుకో; సుగ్రీవుడికి లోబడి బ్రతుకు.)

సుగ్రీవుడికి అంగదుడంటే ఎటువంటి ప్రేమ ఉండేదో కూడా అంగదుడి మాటలవల్ల తెలుస్తున్నది.

**న చాహం యౌవరాజ్యేన సుగ్రీవేణాభిషేచితః**
**నరేంద్రేణాభిషిక్తోఽస్మి రామేణాక్లిష్ట కర్మణా.**
**స పూర్వం బద్ధవైరో మాం రాజా దృష్ట్వా వ్యతిక్రమమ్**
**ఘాతయిష్యతి దండేన తీక్ష్ణేన కృతనిశ్చయః**

(కిష్కింధ - 53 సర్గ. 17-18 శ్లో)

(నన్ను యువరాజుగా అభిషేకించినవాడు సుగ్రీవుడు కాడు, శ్రీరాముడు. సుగ్రీవుడికి నామీద మొదటి నుంచీ బద్ధవైరమే. ఇప్పుడు నా వల్ల ఒక చిన్న అపరాధం జరిగినా సరే క్రూరమైన శిక్ష విధించి, చంపి తీరుతాడు.)

**కథం శత్రుకులీనం మాం సుగ్రీవో జీవయిష్యతి.**
**ఉపాంశుదండేన హి మాం బంధనేనోపపాదయేత్**
**శఠః క్రూరో నృశంసశ్చ సుగ్రీవో రాజ్యకారణాత్.**

(కిష్కింధ-55 సర్గ. 8, 10 శ్లో.)

(పగవాడినైన నన్ను సుగ్రీవుడు ఎలా బ్రతకనిస్తాడు? ఒంటరివాడిని చేసి నన్ను హింసిస్తాడు, బంధిస్తాడు. సుగ్రీవుడు కుచ్చితుడు, క్రూరుడు, దుర్మార్గుడు; రాజ్యం కొరకు ఏమైనా చెయ్యగలడు.)

అంగదుడి ఈ మాటలు సుగ్రీవుడి మనస్తత్వం తెలిసి అన్నవేగాని, ఊరికే అన్నవికావు. తన తమ్ముడి మనస్తత్వం ఎలాంటిదో వాలికి కూడా బాగానే తెలుసును. కనుకనే

ప్రేటుతిన్న వెంటనే తాత్కాలికమైన క్రోధంకొద్దీ రాముడిని దూషించినా, అంతలోనే తెలివి తెచ్చుకొని, తన తప్పును ఒప్పుకొని, రాముడిని పొగడి – సుగ్రీవుడి మాట ఎలా ఉన్నా – రాముడికి అంగదుడిపై దయకలిగేలాగున జాగ్రత్త పడ్డాడు. వాలిచేత తప్పిదాన్ని అంగీకరింపచేసింది అతడి పితృహృదయమేగాని రాముడి సమాధానం కాదు. వాలి తాను నిజంగా దోషిని, వధ్యుడను అని హృదయ పూర్వకంగానే అంగీకరించాడని మనం నమ్మితే, అతడు అదే గ్రుక్కతో పలికిన ఈ మాటను కూడా నిజమని నమ్మవలసివస్తుంది.

**త్వత్తో౽హం వధమాకాంక్షన్ వార్యమాణో౽పి తారయా**
**సుగ్రీవేణ సహభ్రాత్రా ద్వంద్వయుద్ధముపాగతః**

(కిష్కింధ 18 సర్గ. 60 శ్లో.)

(రామా, నాకు నీ చేతిలో చచ్చిపోవాలని కోరిక ఉన్నది. కనుకనే తార వద్దంటున్నా వినకుండా సుగ్రీవుడితో ద్వంద్వయుద్ధానికి వచ్చాను.)

ఈ మాటలో నిజం ఎంత ఉన్నదో, రాముడి సమాధానంతో వాలి సంతృప్తి పడటంలోకూడా అంతే నిజమున్నది.

కనుక వాలి సంతృప్తితో నిమిత్తం లేకుండా శ్రీరాముడి చర్యను స్వతంత్రంగా విమర్శింపవలసి ఉన్నది.

వాలి చేసిన ఆక్షేపణలో ఒక్కదానికైనా రాముడు సంతృప్తి కరమైన సమాధానం ఇవ్వలేక పోయాడు.

(1) వాలి చేసిన మొదటి ఆక్షేపణ:

'నీకు నేనేమీ అపకారం చెయ్యలేదే – నన్నెందుకు నిష్కారణంగా వధించావు?'

దానికి రాముడి సమాధానం ఇది:

'నీకూ నాకూ వ్యక్తిగతమైన వైరం లేకపోయినా, నిన్ను చంపుతానని నేను సుగ్రీవుడికి మాట ఇచ్చి ఉన్నాను. మిత్రుడికి ఇచ్చిన ఆ మాటను నేనెలా తప్పగలను?'

మొదటికి వధ్యత్వావధ్యత్వ మీమాంస చెయ్యకుండా తొందరపడి వాలిని చంపుతానని సుగ్రీవుడికి రాముడు వాగ్దానం చెయ్యటమే తప్పు. ఒక తప్పును సమర్థించు కోవటానికి చేసిన తప్పుడుపని ఎలా సమర్థనీయ మవుతుంది?

(2) వాలి వేసిన రెండో ప్రశ్న:

'నేనేమీ పాపం చెయ్యలేదే – నిరపరాధినైన నన్నెందుకు శిక్షించావు?'

దీనికి రాముడి సమాధానం ఇలా ఉన్నది:

'కూతురుతో సమానమైన మరదలితో నీవు కామ ప్రవృత్తుడవైనావు. కనుక నీవు పాపివి, వధ్యుడవే.'

రాముడు చెప్పింది ధర్మంలాగే కనిపిస్తున్నది పై చూపులకు. లోతుగా విచారిస్తే అందులో ధర్మం లేదు.

మరదలు కూతురుతో సమానమనేది నరజాతి ధర్మం. (నరుల్లో కూడా కొన్ని తెగల్లో మాత్రమే.) వానరులకు నర ధర్మాన్ని వర్తింపజేయటం ధర్మం కాదు. అవునంటే – తల్లితో సమానమైన వదినను భార్యగా స్వీకరించిన సుగ్రీవుడికి కూడా ఇదే శిక్షను రాముడు విధింపవలసి ఉండెను. మరి రాముడు సుగ్రీవుడి నెందుకు శిక్షించలేదు? 'అన్న చనిపోయిన తర్వాతగాని, లేక చనిపోయినాడని నమ్మినపుడుగాని వదినను భార్యగా స్వీకరింపవచ్చు. ఇది వానర జాతి ధర్మం!' అనవచ్చు. అయితే యుద్ధవిజితుడి భార్యను కూడా రాజ్యసంపదలతోపాటు స్వాయత్తం చేసుకోవటం కూడా వానరజాతి ధర్మమే కావచ్చు.

పతివ్రతాశిరోమణి, తన భార్య అయిన సీతను బలాత్కారంగా ఎత్తుకొనిపోయిన రావణుడిని కూడా తనకు సీతను తిరిగి అప్పగిస్తే క్షమించటానికి రాముడు సిద్ధపడి ఉన్నాడు. ఆ విధంగా రాయబారాలు జరిపించాడు. 'రుమ' సీతలాగ పతివ్రత కాదు. సుగ్రీవుడు యువరాజుగా ఉన్నంతకాలం అతడి భార్యగా ఉన్నది. అతడు కిష్కింధను వదలి పారిపోయిన తర్వాత వాలితో సుఖంగా కాపురం చేసింది. మరల సుగ్రీవుడు రాజయి వచ్చిన తర్వాత అతడితో సంసారం సాగించింది. అంటే 'రుమ' వాలికి స్వబుద్ధితోనే వశమైనదిగాని, వాలి ఆమెను బలాత్కరించినవాడు కాదన్నమాట. అట్టి సందర్భంలో వాలికి ఒక హెచ్చరికనైనా

ఈయకుండా ఒకేసారి అతడికి మరణశిక్షను విధించి అమలు జరపటం అన్యాయం, అధర్మం.

(3) వాలి మూడవ ప్రశ్న :

'నేను సుగ్రీవుడితో ద్వంద్వయుద్ధం చేస్తూ, నిన్ను గమనించక ప్రమత్తుడనై ఉండగా, నామీద నీవు బాణ ప్రయోగం ఎలా చేశావు?'

దీనికి రాముడి సమాధానం ఏమంటే :

'నీవు ఒక మృగానివి. వేటాడే రాజులు మృగాలను ఎదుటనుంచిగాని, చాటునుంచిగాని, వలలొడ్డిగాని, ఎలాగైనా చంపవచ్చు. కనుక ప్రమత్త స్థితిలో ఉన్న నిన్ను వేటాడటం రాజధర్మమే,

ఇంతవరకు రాముడు వాలిని మనుష్యుడివలె గుర్తిస్తూ ధర్మాధర్మ మీమాంస చేశాడు. ఎప్పుడైతే వాలిని రాముడు మృగంగా పరిగణించాడో, అప్పుడే ఇంతవరకూ అతడు చేసిన అగమ్యాగమన దోషారోపణ నిస్సారమని తేలిపోయింది. తాను వాలిని చంపినది దోషమునకు శిక్షగనో, వేటగనో రాముడికి నిశ్చయబుద్ధిలేదు.

(4) వాలి వేసిన నాల్గవ ప్రశ్న చాల ధర్మ సూక్ష్మముతో కూడినది.

'నేను మృగమును. అందులో పంచనఖమును. ఐదు గోళ్ళుగల జంతువులలో ఏదుపంది (ఆళువ), ముళ్ళపంది, ఉడుము, కుందేలు, తాబేలు–అనే ఐదింటి మాంసము మాత్రమే క్షత్రియులకు భక్షణీయం. నీవు నా మాంసాన్ని తినవు. నా చర్మంగాని, నా వెంట్రుకలుగాని, నా ఎముకలు గాని నీ కెందుకూ పనికిరావు. నన్ను నీవు ఏమి కోరి చంపినట్లు? నిష్కారణమైన జంతువధ చేయటం సత్కులీనుడైన క్షత్రియుడికి తగునా?'

వాలి అడిగిన ఈ ప్రశ్నకు రాముడు సమాధానం చెప్పలేకపోయినాడు. 'శేషం కోపేన పూరయేత్' అన్నట్లు 'నీవు కోతివి. నీవు వృద్ధోపసేవనం చెయ్యలేదు. నీకు ధర్మసూక్ష్మం తెలియదు' అని బుకాయించాడు. ఇది వట్టి బుకాయింపేనని – కాళూరివారు ఉదాహరించిన – ధర్మాకూతకర్త కూడా అంగీకరించక తప్పింది కాదు. కోతిని పొరపాటువలన చంపినవాడు కూడ ప్రాయశ్చిత్తం చేసికోవలెనన్నప్పుడు, బుద్ధి పూర్వకంగా చంపటం ఎంతటి దోషమో చెప్పనక్కరలేదు. ధర్మాకూతకర్త రాముడి చర్యను ఆపద్ధర్మమని మాత్రమే సమర్థింపగలిగాడు. రాజనీతిలో నీతి ఎంత ఉన్నదో, ఆపద్ధర్మంలో ధర్మం అంత ఉన్నది. ధర్మానికి తిలాంజలి ఇచ్చి, స్వార్థసిద్ధికి వక్రమార్గాలను అనుసరించటం పేరే ఆపద్ధర్మం.

'శ్రీరాముడు వాలిని వెనుకనుండి వధింపలేదు. అతడి ఎదుటనుండే బాణ ప్రయోగం చేశాడు. కనుక అందులో దోషం లేదు' అనే వాదం ఒకటున్నది. నిజమే.

**'రాఘవేణ మహాబాణో వాలివక్షసి పాతితః'**

(కిష్కింధ – సర్గ 16 – శ్లో.35)

(రాముడు వేసిన బాణం వాలి రొమ్మున గ్రుచ్చుకున్నది) అనటంవల్ల రాముడు వాలి ఎదుటనుండే బాణప్రయోగం చేశాడన్నది నిజమే. అయినా వాలి అడిగిన నాలుగు ప్రశ్నల వల్ల రాముడు బాణప్రయోగం ఏ దిక్కునుండి చేశాడు అనే ప్రశ్నయే ఉదయించదు. ఏ దిక్కునుండి బాణం వేసినా అది సమానమైన దోషమే అవుతున్నది.

శ్రీ కుమారస్వామిగారు చేసిన మరికొన్ని సమర్థనలు:

(1) 'సాక్షిగానున్న రాజునకు బలవంతుని బారినుండి బలహీనుని కాపాడుట అను ధర్మము వర్తించును.'

అధర్మమునుండి ధర్మాన్ని కాపాడటమే రాజధర్మము. బలహీనుడే అధర్మపరుడై, బలవంతుడు ధర్మపరుడై యున్నపుడు కూడ బలహీనుడనే కారణంతో అధర్మపరుడికి అండగా నిలబడి ధర్మపరుడిని బలవంతుడైన మాత్రాన శిక్షించటం రాజధర్మమా?

(2) 'దోషికి దోషమును తెలిపి శిక్షింపవలసిన పనిలేదు. ఇది త్రేతాయుగ మనుధర్మము.'

నిందితుడికి అతడి నేరాన్ని తెలిపి, అతడి ప్రతివాదం విని, నేరాన్ని నిర్ణయించి, శిక్షను ప్రకటించి, ఆ శిక్షను నిందితుడికి తెలిపి, దానిమీద అతడు పునర్విమర్శకోరే

అవకాశామిచ్చి, ఆ మీదట శిక్షను అమలు జరిపే నేటి న్యాయశాసన విధానం రామరాజ్యంలో లేకపోవచ్చు. కాని ఒక్క నేరారోపకుడి మాటలు మాత్రమే విని, నిందితుడి మాట వినకుండానే నేర నిర్ధారణ చేసి శిక్ష విధించేటంతటి అన్యాయ విధానం త్రేతాయుగంలో కూడా లేదు. శూద్రుడై ఉండి తపస్సు అనే నేరాన్ని చేసిన శంబుకుడికీ, సారమేయాన్ని హింసించిన బ్రాహ్మణభిక్షువైన సిద్ధార్థకుడికీ శిక్షలు విధించేముందు రాముడు నిందితులను విచారించి వాళ్ల నోటిమీదుగానే వాళ్ల నేరాన్ని చెప్పించి మరీ శిక్ష విధించాడని రామాయణమే చెబుతున్నది.

(3) వ్యక్తిగత వైరము లేనపుడు వ్యక్తిగత యుద్ధమునకు కాలు దువ్వటం అసంబద్ధము. కనుకనే రాముడు స్వయంగా వాలితో యుద్ధం చేయక సుగ్రీవుడి చేత పోరించాడంటూ, ఈ వాదానికి సమర్థకంగా భారతయుద్ధంలో శ్రీకృష్ణుడి పాత్రను కుమారస్వామిగారు ఉదాహరించారు. భారతోదాహరణంవల్ల వ్యక్తిగత వైరమున్నపుడు ప్రత్యక్ష యుద్ధము, ధర్మాధర్మ కారణమైన వైరమున్నపుడు పరోక్ష యుద్ధము సంభవమగునని తెలియును' అని కుమారస్వామిగారు ఒక వినూతన సిద్ధాంతం చేశారు. నరసింహుడు హిరణ్యకశిపుడిని చంపటంగాని, శ్రీకృష్ణుడు నరకుడి పైకి దాడి వెడలి యుద్ధంచేసి వధించటంగాని, ఇంకా శివకేశవులు అనేకపర్యాయాలు అనేకమంది రాక్షసులను సంహరించటం గాని వ్యక్తిగత వైరంవల్ల కాదు. ధర్మాధర్మ కారణమైన వైరం వల్లనే; తమ ఆశ్రితులైన దేవతల, ఇతర భక్తుల రక్షణార్థమే. ఇక భారతయుద్ధంలో శ్రీకృష్ణుడి ధర్మనిరతి ఎంతటిదనే ప్రశ్న అలా ఉంచినా, వాలివధలో రాముడి చర్య కృష్ణుడిచర్యవంటిదైనా కాదు. కృష్ణుడు భీమార్జునులను ప్రోత్సహించి, వారిచేతనే కౌరవవధ చేయించాడుగాని, తాను దొంగచాటుగా దెబ్బతీయలేదు. రాముడు సుగ్రీవుడి చేతనే వాలిని చంపించి ఉంటే ఆక్షేపణకు అవకాశమే లేదు. స్వయంగా ఎదటబడి యుద్ధం చేసి చంపినా ఆక్షేపణ లేదు. యుద్ధధర్మాలంటూ ఏవో కొన్ని ఉన్నవనుకుంటే మాత్రం రాముడి చర్య నింద్యమే. ఏదో విధంగా శత్రు సంహారం చెయ్యటమే ధర్మం అనుకుంటే అసలు వాదమే లేదు. అప్పుడు లోకంలో జరుగుతున్న ఏ హత్య కూడా నింద్యం కానేకాదు.

(4) 'శ్రీరాముడు స్వార్థపరుడయినచో వాలితోనే చేయి కలిపి యుండెడివాడు.'

సుగ్రీవుడితో మైత్రిచేసే సమయానికి వాలి బలమెట్టిదో రాముడికి వివరంగా తెలియదు. వాలికీ రావణుడికీ ఉన్న స్నేహం సంగతి అసలే తెలియదు. రామపట్టాభిషేకానంతరం అగస్త్యుడు రావణుడి పూర్వచరిత్ర చెప్పేవరకు (ఉత్తరకాండ 34 సర్గ) రాముడికీ సంగతి తెలిసి ఉన్న సాక్ష్యం లేదు. ఇంతకూ రాముడు సుగ్రీవుడితో స్నేహం చేసింది కబంధుడి సలహా ననుసరించి. అతడు సుగ్రీవుడి పేరెత్తక వాలి సహాయం తీసుకోమని సలహా ఇచ్చి ఉన్నట్లయితే రాముడు వాలినే ఆశ్రయించి ఉండేవాడు. రాముడు స్వీయప్రయోజనం కోరి, సుగ్రీవుడు తనకు సాయపడతాడనే ఆశతోనే అతడిని వెదుకుకొంటూ వచ్చాడే గాని, సుగ్రీవుడిని ఉద్ధరించాలని వచ్చినవాడు కాదు. సుగ్రీవుడిని దర్శించగానే లక్ష్మణుడు చేసిన ప్రసంగం (కిష్కింధ-4 సర్గ; 6-24 శ్లో.) చూస్తే ఈ సంగతి స్పష్టమవుతుంది. సుగ్రీవుడి సాయం తాను పొందగలిగేందుకై అతడికి తానూ సహాయం చేసేందుకు రాముడు అంగీకరించాడు. వాలిని చంపుతానని మాట ఇచ్చిన (5వ సర్గ) తర్వాతనే రాముడు సుగ్రీవుడిని వాలితో వైర కారణమేమిటని అడిగి (8వ సర్గ) తెలుసుకున్నాడు. సుగ్రీవుడితో చేయి కలపటానికి రాముడిని ప్రేరేపించింది స్వార్థసాధనదృష్టి మాత్రమే గాని ధర్మదృష్టి కాదు.

భరతుడి ప్రతినిధిగా తాను దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తున్నట్లు రాముడు చెప్పుకొన్నది కూడా బుకాయింపే. అంగ వంగ కళింగాది షట్పంచాశ (ఛప్పన్న) రాజ్యాలలో కోసలమొకటి. దక్షిణ కోసల రాజుకుగాని, రాజప్రతినిధికి గాని కిష్కింధారాజ్యంలో దుష్టశిక్షణాధికారం ఎలా

ఉంటుందో రాముడికే తెలియాలి. ఎవరికైనా, ఎక్కడనైనా దుష్టశిక్షణాధికారం ఉంటుందంటే అది వేరే సంగతి. అప్పుడు భరతుడి ప్రతినిధిత్వం అనవసరం.

శ్రీరామావతారంలో వాలిని దొంగచాటుగా చంపిన పాపఫలితంగానే శ్రీకృష్ణుడు బోయవాడి చేతిలో హతుడైనాడనే ఐతిహ్యం కూడా రాముడి చేతలోని పాతకాన్ని నిరూపిస్తున్నది.

ఈనాడు మనం ధర్మాధర్మ నిర్ణయం చేయబూనేకంటే, అసలు రామాయణ కర్తయైన వాల్మీకి చేసిన ధర్మనిర్ణయం తెలుసుకోవటం మేలు.

రాముడి చర్యను గర్హిస్తూ వాలి పలికిన పలుకులకు ముందు వెనుకల వాల్మీకి వాక్యాలు ఇలా ఉన్నవి:

**తం దృష్ట్వా రాఘవం వాలీ లక్ష్మణం చ మహాబలమ్**
**అబ్రవీత్ పరుషం వాక్యం ప్రశ్రితం ధర్మ సంహితమ్,**

**స భూమానల్పతేజో సుర్నిహతో నష్ట చేతనః**
**అర్థసంహితయా వాచా గర్వితం రణగర్వితమ్.**

(కిష్కింధ–17 సర్గ; 13–14 శ్లో.)

(దెబ్బతిని, నేలపై బడి, కొనప్రాణంతో ఉన్న వాలి, గర్వితుడూ, రణ గర్వితుడూ ఐన రాముడినీ, బలశాలియైన లక్ష్మణుడినీ చూచి నీతియుక్తము (ప్రశ్రితము), ధర్మార్థ సహితము, పరుషము నైన వాక్యం పలికాడు.)

**ఇత్యుక్తః ప్రశ్రితం వాక్యం ధర్మార్థ సహితం హితమ్**
**పరుషం వాలినా రామో నిహతేన విచేతసా.**
**తం నిష్ప్రభమివాదిత్యం ముక్తతోయ మివాంబుదమ్**
**ఉక్తవాక్యం హరిశ్రేష్ఠ ముపశాంత మివానలమ్.**
**ధర్మార్థ గుణసంపన్నం హరీశ్వర మనుత్తమమ్**
**అధిక్షిప్తస్తదా రామః పశ్చాద్వాలిన మబ్రవీత్.**

(కిష్కంధ. 18 సర్గ. 1–3 శ్లో.)

(దెబ్బతిని, ప్రాణాలు కడబట్టి, కాంతిహీనుడై, అస్తమిస్తున్న సూర్యుడిలాగ, రక్తస్రావంవల్ల వర్షించి వట్టిదైన మేఘంలాగ, చల్లారిన అగ్నిలాగ ఉన్నాడు వాలి. అతడు ధర్మార్థ గుణసంపన్నుడు; కపిశ్రేష్ఠుడు; అతడికంటె మంచివాడంటూ లేడు. అట్టి వాలి నీతియుక్తము, ధర్మార్థ సహితము, హితము, పరుషము అయిన మాటలతో రాముడిని అధిక్షేపించాడు. అప్పుడు రాముడు వాలితో ఇలా పలికాడు.)

ఈ సందర్భంలో వాల్మీకి వాలిని మహాత్ముడు, అనుత్తముడు, ధర్మార్థగుణ సంపన్నుడు అని ప్రశంసించటమూ, రాముడిని గర్వితుడు, రణగర్వితుడు అని మాత్రమే చెప్పియుండటమూ గమనించదగి ఉన్నది. అలాగే వాలి వాక్యమును గురించి ఒకటికి రెండుసార్లు ప్రశ్రితము, ధర్మార్థ సంహితము, హితము అని ప్రశంసించటమూ, రామవాక్యాన్ని గురించి అలాంటి పొగడ్త మాటలేమీ ప్రయోగించకపోవటమూ కూడా గమనించ వలసిఉన్నది.

వాలి వాదమే ధర్మార్థ సహితమని వాల్మీకి తీర్పు. రాముడి వాదం ధర్మసమ్మతమని వాల్మీకికే నమ్మకం లేదు.

త్రేతాయుగధర్మం వాల్మీకికంటె మనకెక్కువ తెలియదు.

(1972, అక్టోబరు, 'భారతి', పుటలు 36–41.)

**గమనిక: –**

1972–73 సంవత్సరాలలో 'భారతి'లో వచ్చిన ఇతర వ్యాసాల వివరాలు: –

1) 1972 ఫిబ్రవరి 'భారతి' ('కలగూరగంప') – "వాలివధ – ఒక పరిశీలన" – శ్రీ కాళూరి హనుమంతరావు

2) 1972 జూన్ 'భారతి' ('కలగూరగంప') – పై పరిశీలనకు సమాధానం – శ్రీ వి.ఏ. కుమారస్వామి.

3) 1973 మార్చి 'భారతి' – "వాలివధ–వాల్మీకి తీర్పు" – ఆచార్య శలాక రఘునాథ శర్మ, (డా॥ తిరుపతిరావుగారి వ్యాసానికి సమాధానం. ఇది చాలా పెద్ద వ్యాసం. 2009లో వచ్చిన శర్మగారి 'కదంబవనం" అనే గ్రంథంలో చేర్చబడింది.)

4) కె.వి. పుట్టప్ప (కువెంపు)గారు కన్నడంలో వ్రాసిన "రామాయణ దర్శనం"లో చెట్టుచాటునుండి వాలిని కొట్టిన రాముడు, వాలిదగ్గరకు వచ్చి, "క్షమించు" అని నమస్కరిస్తాడు.



# మహాభారతము - కర్ణుడు

### - డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

(ముఖ్య గమనిక:- మహాభారతంలో అతి ప్రధానమైన పాత్రలలో కర్ణుని పాత్ర ఒకటి. అసలు కురుక్షేత్ర మహాసంగ్రామానికి మూలకారకుడు కర్ణుడు. శ్రీకృష్ణుడు, కుంతి, భీష్ముడు - ఈ ముగ్గురు మాత్రమే కర్ణుని జన్మరహస్యం తెలిసినవారు. వీరు అతనికి ఎంతగానో నచ్చజెప్పారు. వీరి మాటలు విని, కర్ణుడు పాండవ పక్షానికి వచ్చి ఉన్నట్లయితే అసలు యుద్ధమే జరిగి ఉండేది కాదు. అతడే చక్రవర్తి అయ్యుండేవాడు. దుర్యోధనునకు ఇచ్చిన మాటకు కట్టుబడి, అతడు తన ఉజ్జ్వల భవిష్యత్తును త్యాగం చేసి, ఆత్మార్పణం కావించుకున్న విషాదాంత నాయకుడు కర్ణుడు! తనతో సహా కౌరవులందరూ యుద్ధంలో చనిపోతారనీ, పరమధార్మికుడైన ధర్మరాజే ఈ సమస్త భూమండలాన్ని పరిపాలించడానికి యోగ్యుడనీ, తాను అన్ననే విషయం అతనికి చెప్పవద్దనీ, అలా చెపితే అతడు యుద్ధం చేయడనీ, యుద్ధం చేయకపోతే ఆ ధర్మాత్ముడు చక్రవర్తి కాలేడనీ - ఇత్యాదిగా తన మనసులోని మాట కృష్ణునితో స్పష్టంగా చెప్పాడు కర్ణుడు. తన ప్రాణాలకు ముప్పు వస్తుందని తెలిసికూడా సహజ కవచకుండలాలను ఇంద్రునికి దానంచేసివేశాడు! కర్ణుని దానగుణ ప్రశస్తిని గురించి ప్రజలలో ఎన్నో కథలు వ్యాప్తిలో ఉన్నాయి. అతడు "దానకర్ణుడు"గా ప్రసిద్ధికెక్కాడు. ఇటువంటివి అతనిలోని సుగుణాలు. చిన్నతనంనుండీ అర్జునుని మీద ఎంతో మాత్సర్యాన్ని పెంచుకోవడం, తనకు దుర్యోధనుని దగ్గర లభించిన ప్రాపును శాశ్వతంగా నిలుపుకోవాలనే ఉద్దేశంతో నిత్యమూ కౌరవ పాండవుల మధ్య వైరాన్ని రగుల్కొల్పడం, దుర్యోధనుని ప్రీతికోసం నిండుసభలో ద్రౌపదిని దుర్భాష లాడటం, అర్జునుని చంపివేస్తానని ప్రగల్భాలు పలకడం, అభిమన్యుణ్ణి అన్యాయంగా చంపడంలో పాలుపంచుకోవడం - మొదలైనవన్నీ అతనిలోని దుర్గాణాలు. ఈ విధంగా కర్ణుని పాత్రలో గుణదోషాలు రెండూ ఉన్నాయి. కర్ణుడు పంచపాండవులవలెనే దైవాంశ సంభూతుడు; సూర్య భగవానుని వరంవల్ల పుట్టినవాడు. తరువాతి కాలంలో శ్రీకృష్ణునిచే చంపబడిన నరకాసురుని అంశ అతనిలో ప్రవేశించింది. అందువల్ల అతనిలో దైవాంశాలూ, రాక్షసాంశాలూ రెండు ఉన్నాయని నా భావన. కాని కొందరు పండితులు, విమర్శకులు తమ రచనలలోను ఉపన్యాసాల లోను, కర్ణుని దోషాలను మాత్రమే చూపించి, గుణాలను విస్మరిస్తున్నారు. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ("మహాభారత తత్త్వకథనము"), దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ("ద్రోణప్రశస్తి"), శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారు (శ్రీరస"లో చేసిన 36 మహాభారతోపన్యాసాలు) మొదలైనవారు ఈ కోవకు చెందినవారు. కర్ణుని పాత్రలోని గుణదోషాలను రెండింటినీ ప్రస్తావిస్తూ, "సమచిత్తం"తో విమర్శించిన పండితులలో పుట్టపర్తి నారాయణాచార్యుల వారు, మరుపూరి కోదండరామరెడ్డిగారు, ఆర్.యస్. సుదర్శనంగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు, శ్రీ బలభద్రపాత్రుని హనుమంతరాయశర్మగారు ముఖ్యులు. "శ్రీరస" శ్రోతలు కర్ణుని పాత్రను సానుభూతితో అర్థంచేసుకుంటారనీ, మహాభారతంలోని కర్ణుడు "విషాదాంత నాయకుడు" (Tragic Hero) అని గుర్తిస్తారనీ, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు వ్రాసిన గొప్పవ్యాసాన్ని ఇక్కడ ఇస్తున్నాను - సంపాదకుడు)

* * *

జీవితములో రాణించవలెనని కోరుకొనుట మానవ స్వభావ సహజము. కాని ఈ కోరిక సమర్థుడైన వ్యక్తిలో చాల బలముగ నుండును. జీవితములో అన్ని విధముల రాణింపదగిన సామర్థ్యముండి రాణింపలేని వ్యక్తికి మనోవేదన మెండు. ఈ మనోవేదన ఒక్కొక్కసారి ఆత్మనాశమునకు, సంఘనాశమునకు దారితీయును.

సామర్థ్యము రాణించి సంఘమున తగిన స్థానము పొందుటకు అభిజాత్యము, ఐశ్వర్యము, ఆదరణ, అదృష్టము

అనేక విధముల దోహదము చేయగలవు. దేశకాల పాత్రములనుబట్టి వీని ప్రభావ మొక్కొక్కసారి ప్రత్యక్షముగ కన్పించును. ఒక్కొక్కసారి పరోక్షముగ ప్రసరించును. కాని ఇవి లోపించినపుడు వ్యక్తి సామర్థ్యము సంఘమున పైకి పెరిగి ప్రకాశించుట కష్టము. అంతేగాక ఆ సామర్థ్య మణగద్రొక్కబడు ప్రమాదము గూడ లేకపోలేదు. అణగద్రొక్కబడిన సామర్థ్యము సంఘమున పెక్కు అనర్థములకు దారితీయును.

భూమిని చీల్చుకొని మొలిచి పైకి పెరుగుట జీవశక్తి గల గింజతత్త్వము. ఒక వేళ బండ ఒకటి దాని మీద అడ్డు పడినను ఆ గింజ మొలకెత్తక మానదు. ఆ మొలక మీది కెదుగక మానదు. బండకు భూమికి మధ్య సందు చేసికొని ఆ మొలక మొండికి బడి మీది కెదుగును. పాపము! చక్కని మొక్క వక్రించును. వక్రించుట ఆ మొక్క తప్పుగాదు. మీద బండ పడుట దాని దురదృష్టము.

సమర్థుని విషయము గూడ ఇంతే. అతని సామర్థ్యము సంఘమున రాణించుటకు వీలు లేకుండ ఏ అనభిజాత్యమో, దారిద్ర్యమో, దురదృష్టమో అడ్డుపడినచో అతని బుద్ధి వక్రించును. ఈర్ష్యాక్రోధము లతని గుండెలో గూడు కట్టుకొనును. స్వాతిశయతత్త్వమాతని స్వభావములో తలయెత్తును. కీర్తి కాముకత అతని గన్నుల గప్పును. సంఘమున నున్న వర్గస్పర్థల నాధారము చేసికొని అతని సామర్థ్యము పైకి వచ్చి ప్రకాశించును. పరిణామములు అతని కక్కరలేదు. ప్రకాశమే అతని లక్ష్యము.

ఇట్టి సమర్థులు ఛాయామాత్రులుగ జీవింపలేరు. వీరిదొక విశిష్ట వ్యక్తిత్వము. ఈ వ్యక్తిత్వముతోపాటు వీరికొకటి రెండు ఆదర్శములుండును. పరిస్థితుల ప్రాబల్యముచే ప్రకృతికి, ప్రవర్తనకు, పొత్తుకుదరక తీవ్ర సంఘర్షణకు లోనగుదురు. విషాదాంత నాయకులగుదురు. మహాభారతమందలి కర్ణుడీ కోవకు చెందిన వ్యక్తి.

మానవుడు రాణించుటకు మహనీయరూప మొక ముఖ్యాంగము. చూచినంతనే సంఘము నాకర్షించునది వ్యక్తి స్ఫురద్రూపము. అంతేగాక దీప్తిమంతమైన రూపము వ్యక్తి మనస్సునకు దిటవుతనము నిచ్చును. కర్ణుడు సూర్యతేజము పంచుకొని పుట్టిన మహనీయరూప తేజో విరాజితుడు. సాలప్రాంశుడు. నిజోజ్జ్వలత్కవచుడు. శశ్వత్కుండలో ద్భాసితుడు. శౌర్యాలంకారుడు. సువర్ణ వర్ణుడు.

ఆకారవిశేషమునకు తోడు వ్యక్తికి ఆత్మ విశ్వాసమును గూర్చునవి శక్తిసామర్థ్యములు సంఘమున రాణించుట కివి ముఖ్యాంగములు. కర్ణుడు అసాధారణ శక్తిసామర్థ్య శోభితుడు. మహావీరుడు. అతని బలపరాక్రమములు కౌరవ పక్షముననే గాక పాండవ పక్షమున గూడ పెక్కు ప్రశంస లందుకొన్నవి. ధర్మజుడు **"అతని బాహువిక్రమమును దలంచిననాఁడు గన్నుమూయదు నాకున్"**[1] అని కలవర పడినాడు. అతని ప్రత్యర్థి అర్జునుడు **"యోధాగ్రేసరుడిద్ధ తేజుఁడు రణోద్యోగానురక్తుండు దుస్సాధప్రక్రమ బాహువీర్యుఁడు"**[2] అని అంగీకరించినాడు. శ్రీకృష్ణునంతటి వాడు కర్ణుని బలపరాక్రమములు ప్రశంసించి, అతడు నీతో సమానుడనియే గాదు–అధికుడని గూడ యెఱుంగుము అని అర్జునుని హెచ్చరించినాడు.

**"త్వత్సమం త్వద్విశిష్టంవా కర్ణం మన్యే మహారథమ్."**[3]

కర్ణుని శక్తి సామర్థ్యము లంత గొప్పవి.

మానవుని కాత్మబలము నిచ్చువానిలో ఆదర్శములు ప్రధానములు. దాతృత్వము కర్ణుని ఉన్నతాదర్శము. అది అతనికి జన్మసిద్ధము. ఎంతో బలీయము. పెద్ద కుప్పలో గుప్పెడు తీసిపెట్టుట దానముగాదు. ఎదుటివ్యక్తి తన్ను వంచన చేయుటకు చేయిచాపుచున్నాడని తెలిసి, అడిగినది యిచ్చిన అసువులకే ముప్పు వచ్చునని తెలిసి, పొల్లయొడలికై జన్మవ్రతమును దిగవిడువనని ఒక్క పెట్టున తన కవచ కుండలములు కోసియిచ్చిన మహావదాన్యుడు కర్ణుడు. ఈ వదాన్యతకు దోడు సత్యసంధత గూడ కర్ణుని వ్యక్తిత్వమున

కొక పుష్టి నిచ్చినది; వెలుగునిచ్చినది. అంతేగాక అతడు జిజ్ఞాసువు; నైష్ఠికుడు; దయాపరుడు.

**"బ్రహ్మణ్య స్సత్యవాదీ చ తపస్వి నియత వ్రతః**
**రిపు ష్వపి దయావాంశ్చ తస్మాత్కర్ణో వృషస్స్మృతః"[4]**

కర్ణుని తత్త్వార్థ జ్ఞానము, ధర్మశాస్త్ర పాండిత్యము శ్రీకృష్ణుని ప్రశంసనందుకొన్నవి.

**"ఉపాసితాస్తే రాధేయ బ్రాహ్మణా వేదపారగాః**
**తత్త్వార్థం పరిపృష్టాశ్చ నియమే నానసూయయా**
**త్వమేవ కర్ణ జానాసి వేదవేద్యాన్ సనాతనాన్**
**త్వమేవ ధర్మశాస్త్రేషు సూక్ష్మేషు పరినిష్ఠితః"[5]**

విజ్ఞాన నిష్ఠాపరతలు గూడ మానవునికి బలము నిచ్చునట్టివి. వెలుగును గూర్చునట్టివి.

కాని విధి విధానము చిత్రమైనది. కర్ణుడీ విధముగ దైవాంశ పంచుకొని, క్షత్రియ క్షేత్రమున జన్మించి, మహనీయ రూపతేజోవిరాజితుడైనను, అసాధారణ శక్తిసామర్థ్య శోభితుడైనను, ఆదర్శపరుడైనను, వృద్ధజనోపసేవియైనను, ధర్మసంవేదియైనను – ఆనాటి సంఘమున కేవల మొక సూతపుత్రుడుగ బ్రతుకు తెరువు ప్రారంభింపవలసి వచ్చినది. ఇది జన్మకు – పరిసరములకు, వ్యక్తిత్వమునకు – వృత్తికి పొత్తు కుదురని వైరుధ్యము; తీవ్ర వైరుధ్యము. ఆరడుగుల యెత్తు వ్యక్తి మూడడుగుల యింట మనుగడ సాగించుట వంటిది. నొసలు కొట్టుకొనుట, తల బొప్పి కట్టుట తప్పవు.

అధిరథుని వెంట కొలువు కూటమున కేగిన కర్ణుడు కురుకుమారుల చూచును. వ్యక్తిత్వములోగాని, శక్తి సామర్థ్యములలో గాని కురుకుమారులకు తానే విధముగను తీసిపోడు. కాని ఏమి లాభము? కొలువు కూటము తన్నొక సూతపుత్రునిగనే చూచును. గురుకులమున ప్రవేశించిన కర్ణుడు కురుకుమారుల ప్రతిభ చూచును. ప్రతిభలో తా నే విధమునను వారికి తీసిపోడు. కాని ఏమి లాభము? గురుకులము తనకు చూపు చోటే వేరు. రాకుమారుల ప్రక్క తాను రాణించుటకు ఏ అవకాశమును లేదు. అర్జునుని అందరు ప్రశంసించుచున్నారు. అతని నెదుర్కొని తన అతిశయము నిరూపింతమన్న అందుకవకాశమే లేదు. తాను తక్కువ కులమువాడు. తలపడుటకు తగనివాడు – కర్ణుని కదే పెద్ద తపన. తన సామర్థ్యమన్యాయముగ అణచివేయబడుటేమి? కొలదికి మీరి కవ్వడి కీర్తి గడించుటేమి? తక్కినవారి సంగతి తన కక్కరలేదు. తన అభిమాన విద్య విలువిద్య. అందు తన ప్రత్యర్థి అర్జునుడు. కొట్టిన ఏనుగు కుంభస్థలమునే కొట్టవలెను. గెలిచిన అర్జునునే గెలువవలెను. అప్పటి పరిస్థితులలో కర్ణుని కీ విధమైన మనస్తత్వమేర్పడుట మానవ స్వభావ సహజము.

కాని కర్ణుని కోరిక నెరవేరుటెట్లు? కృపాచార్య ద్రోణాచార్యులు కర్ణుని విద్యావిషయమున విశేషశ్రద్ధ వహింపరు. వారు రాకుమారుల శిక్షణకొరకు ప్రత్యేకముగ నియమింపబడినవారు. ఉద్యోగధర్మమునుబట్టి ద్రోణుడు కురుకుమార శిక్షణ బాధ్యతను స్వీకరించినాడు. ప్రయోజ నాంతరము నాశించి పార్థుని అద్వితీయ ధనుర్ధరునిగ తీర్చిదిద్దు భారము వహించినాడు. అంతేగాని కర్ణుని విషయము మనస్సు నిండ పట్టించుకొనవలసిన అవసర మాయనకు లేదు. కాకున్న కర్ణుని చూచి సూతపుత్రుడు చురుకైనవాడని తలయూపియుండును. తనకు తోచిన విద్యారహస్యములు చెప్పియుండును.

ఆచార్యుడు శ్రద్ధవహింపకున్నను అర్జునునితో గల విద్యాస్పర్థ, అతనిని జయింపగలనన్న ఆత్మవిశ్వాసము కర్ణునిచే అహోరాత్రములు గొప్ప కృషి చేయింపగలవు. అతని ప్రతిభకు పదును పెట్టగలవు. అతని నైపుణ్యమును పెంచగలవు. కాని ఆ ప్రతిభ ప్రకాశించుటెట్లు? ఆ నైపుణ్యము రాణించుటెట్లు? కర్ణుని పురోగతికి అడ్డుపడు పెద్ద బండ అతని సూతకులము. కర్ణుడా నాడు బరువైన బండ క్రింది బలమైన మొలక. పైకి పెరుగుట కాతడు వంకర తిరుగక తప్పలేదు.

కర్ణుని స్వభావము వంకర తిరిగినది. అర్జునునితో అంతకు ముందున్న విద్యాస్పర్థ క్రుళ్ళి మాత్సర్యముగ

మారినది. ఆత్మవిశ్వాసము బూజుపట్టి స్వాతిశయతత్త్వముగ పరిణమించినది. ఈ మాత్సర్య స్వాతిశయ తత్త్వములు కర్ణుని పుట్టుగుణములు కావు. కేవలము జీవిత పరిస్థితులు, సూతకుల సంపర్కము తెచ్చిపెట్టిన గుణములు. కాని ఈ రెండు చెడు గుణములే అతని జీవిత గతిని నిర్ణయించినవి. అతనిని రారాజు పక్షమునకు మరలించినవి. అతని సుగుణ సంపత్తిని కళంకితము గావించినవి. అతని జీవితమును విషాదాంతము చేసినవి.

ఒకని మీది మాత్సర్యముతో అతని విరోధి వర్గమున చేరుట మానవ స్వభావ సహజము. పగవాని పగవాడు ఆప్తమిత్రుడు. ఇక స్వాతిశయ తత్త్వమన్ననో, అది తాను పైకి వచ్చి ప్రకాశించు చోటుకొరకు వెదకునట్టిది. గట్టి చోటు దానికి గిట్టదు. కర్ణుని మాత్సర్య స్వాతిశయ తత్త్వములకు కురుపాండవ విభేదమన్నివిధముల అనుకూలించినది. తనకు పార్థుని మీద నున్నట్లే, పాండవుల మీద మాత్సర్యమున్నవాడు దుర్యోధనుడు. పైగా ధార్తరాష్ట్రులలో తన యంతటి వ్యక్తిత్వమున్న మానిసి లేడు. అందుచేత తా నన్ని విధముల చేరదగిన చోటు కౌరవ పక్షమని కర్ణునికి తోచినది. **"పార్థుని మీది మాత్సర్యముతో కర్ణుడు కౌరవ పక్షమున చేరినాడు."**[6] పార్థునితో పోరి జయించుట, తన్ను తక్కువగ చూచు సంఘమునకు బుద్ధి వచ్చునట్లు తన ఘనతను ప్రదర్శించుట ప్రధాన లక్ష్యములుగా పెట్టుకొన్నాడు. తదనుగుణముగ ప్రవర్తించినాడు. కురుపాండవ వైరమును ప్రజ్వరిల్ల జేసినాడు. పరిణామములు విస్మరించినాడు.

అస్త్రవిద్యా ప్రదర్శనము కర్ణుని జీవితములో ఒక పెద్ద మలుపు. ఇంతవరకు పరిగణనలేని అతని ప్రతిభ ప్రకాశించుటకు, అంతరంగమున కుములుచున్న మాత్సర్య స్వాతిశయతత్త్వములు చల్లబడుటకు అస్త్రవిద్యా ప్రదర్శనము చక్కని అవకాశము. పైగా అర్జునుడు రంగమున విజృంభించి తన నైపుణ్యమును ప్రదర్శించుచున్నాడు. అందరి మెప్పును పొందుచున్నాడు. కర్ణునికన్ను లది సహింపలేకపోయినవి. అతని ఆవేదన కట్టలు త్రెంచుకొన్నది. రంగభూమి అస్త్రవిద్యావిశారదుల కెల్ల సామాన్యము గనుక కవ్వడిని మార్కొనుట కిప్పుడు కులము అడ్డురాదని ఊహించుకొన్నాడు. అతని నెదిరించి మించి, తన్ను తక్కువగ చూచు సమాజమునకు కన్ను తెరిపించి, తన ఆధిక్యమును జూపి తలవంపు చేయించవలె ననుకొన్నాడు. రంగ ద్వారమున నిలిచి భుజమప్పళించి రంగమధ్యమున దూకినాడు. ఆచార్యవర్యులకు నమస్కరించి అర్జునునివైపు దిరిగి –

**"నీవ కడు నేర్పు కాఁడవు**
**గా వలవదు వీనిఁ గొన్ని గఱచితి మేమున్**
**నీ విద్య లెల్లఁ జూపుదు**
**మే వీరులు సూచి మేలు మేలని పొగడన్"**[7]

అని తన మనోవేదనను వెళ్ళగ్రక్కి విజృంభించినాడు. అస్త్రవిద్యా నైపుణ్యమును చూప సమకట్టినాడు. ఆ సమయమున కృపాచార్యుడు రంగనియమముల ననుసరించి నీవు కులము తక్కువ వాడవని, కవ్వడితో తలపడ నర్హత లేనివాడవని పలుకుటతో కర్ణుని గుండెలో బాకు గ్రుచ్చినట్లయినది.

అది కర్ణుడు తన అర్హతను స్థాపించుకొనలేక సిగ్గుతో శిరము వంచి కొయ్యబారి నిలిచిన క్షణము. అర్జునునితో తలపడి తన ప్రతిభను ప్రదర్శించుటకు, ఆనాటి సమాజమున ఒక వెలుగు వెలుగుటకు – ఇంతకాలమునకు లభించిన మంచి అవకాశము జారిపోవుచున్నది సరిగదా – మీదు మిక్కిలి పెద్ద తలవంపు గలిగినది. ఈ మానహాని కంటె మరణము మేలు. ఇట్టి విషమ సయమున దుర్యోధనుడు దేవునివలె ముందుకు వచ్చినాడు. అంగరాజ్య మిచ్చి అభిషేకించినాడు. సూతపుత్రునొక మహారాజుగా మార్చినాడు. తన్నావరించిన మబ్బుతెరను తొలగించినాడు. ప్రాణము పోసినాడు. ఒక్క మాటలో చెప్పవలెనన్న ఆనాడు కౌరవసభలో మానభంగమొందు ద్రౌపది శ్రీకృష్ణున కెంత ఋణపడియున్నదో, ఈనాడు కర్ణుడు దుర్యోధనున కంత

ఋణపడినాడు!

ఇట్టి స్థితిలో కర్ణుని హృదయమే గాదు – ఏ మానవ హృదయమైనను అభేద్యమైత్రీ భావముతో, అచంచల స్వామి భక్తితో తొణికిసలాడక మానదు. తన కింత మహోప కారము చేసిన దుర్యోధనునకు తానేమి ప్రత్యుపకారము చేయగలడు? సుయోధనుడు – **"నాతోc జెలిమి మహీనుతముగc జేయు మిదియె యిష్టము నాకున్"**[8] అని అడిగినాడు. కర్ణుడు పులకించి నిలువెల్ల చేతులుగ తన స్నేహమును ధారవోసినాడు. కౌరవపతి అర్జునుని వలన భయము సెడి రొమ్మున చేయిడి నిశ్చింతగ నిదురించినాడు.

కర్ణ దుర్యోధనుల ప్రగాఢమైత్రికి, కర్ణుని స్వామిభక్తికి వెనుకనున్న సన్నివేశము మానసికముగ ఇంత తీవ్రమైనది. కనుకనే దుర్యోధనుడు తమ్ముల మాట కంటె, తాత మాట కంటె, గురువుల మాట కంటె, కడకు తల్లిదండ్రుల మాట కంటె, కర్ణుని మాటనే మిన్నగా గౌరవించినాడు. కర్ణుని తోడిదే జీవితమని గడిపినాడు. రాధేయుడు, పాండవులు తన తమ్ములని తెలిసినను, అఖిల సామ్రాజ్యము హస్తగత మగునని, ద్రౌపది ఆరవ వరుస వరించునని శ్రీకృష్ణుడాశ పెట్టినను, తాను, తన పక్షము పాండవులచేత పతనమొందక తప్పదని గ్రహించినను, కన్నతల్లి కుంతి కౌంతేయుల చేరుమని చేతులొగ్గి అర్థించినను, కురుపితామహుడు కౌగిలించుకొని హితము చెప్పినను – ఆదర్శ ప్రేరితుడై ఆనాడు దుర్యోధనునితో కలిపిన చేతిని వెనుదీయలేక ఆత్మార్పణ మొనర్చుకొన్నాడు.

రాధేయునుండి రారాజు ఆశించిన ప్రయోజనములు రెండు. ఒకటి పార్థుని పరిమార్చుట; మరొకటి, తన అంతరంగమును గుర్తించి ప్రోత్సాహమిచ్చుట.

పార్థుని పరిమార్చుట రారాజున కెంత ముఖ్యమో రాధేయున కంత ఆత్మీయము. ఏలన పార్థుడు హతమైన గాని కర్ణుని మాత్సర్యవ్రణము మానదు. స్వాతిశయ తత్త్వము సఫలత నొందదు. పార్థుడు హతుడైన పాండవులు పతనమైనట్లే. పాండవులు పతనమైన దుర్యోధనునిది ఎదురులేని ప్రభుత. అప్పుడు కర్ణుడు సర్వసర్వంసహాచక్ర వ్యవహారములలో చక్రము తిప్పు స్థితికి రాగలడు. తన్ను తక్కువగ చూచు సంఘమును తలదన్నగలడు. అందుచేత కవ్వడితోడి కయ్యము కర్ణునకు బహుళార్థ సాధకము – స్వామి ఋణము తీర్చునట్టిది; స్వప్రయోజనమును సాధించు నట్టిది.

ఇక దుర్యోధను డాశించిన రెండవ ప్రయోజనము, దుర్యోధనుడు పాండవుల మీది అసూయతో బాధపడు చున్నాడు. వారిని పరిమార్చి ప్రభువు కావలెనని కలలు గనుచున్నాడు. దుర్యోధనుని ఈ బాధ పెద్దల కర్థము గాదు. ఒక వేళ అర్థమైనను దాని మీద వారికి సానుభూతి యుండదు. అందుచేతనే వారందరు దుర్యోధనుని దృష్టిలో పాండవ పక్షపాతులు. శకుని దుర్యోధనుని బాధ నర్థము చేసికొన్నవాడే. అతని పక్షమున నిలుచువాడే. అతని కన్ని విధముల తోడ్పడువాడే. కాని శకునికి పాండవుల మీద మాత్సర్యము లేదు. ఇక ధృతరాష్ట్రుడున్నాడు. అతడు కన్నతండ్రియే. కొడుకు హృదయ మెరిగిన వాడే. కాని ఏమి లాభము? అస్వతంత్రుడు. భీష్మ విదురులపై ఆధారపడినవాడు. ఇక తమ్ములు దుశ్శాసనాదులు. వారు సున్నల వంటివారు. దుర్యోధనుని ప్రక్కనున్నప్పుడే వారికి విలువ. మిగిలినది కర్ణుడొక్కడే!

కర్ణుడు పార్థుని మీది మాత్సర్యముతో బాధపడువాడు. దుర్యోధనుడు పాండవుల మీది మాత్సర్యముతో బాధపడు వాడు. ఇద్దరు ఈ కడుపుకుట్టువ్యాధితో బాధపడు వారు గనుక ఒకరినొకరు చక్కగ అర్థము చేసికొనగలరు. సానుభూతిని కలిగియుండగలరు. ప్రకృతిని బట్టియే గాక పరిస్థితులనుబట్టి గూడ కర్ణుడు దుర్యోధనుని విడువడు. విశేషించి స్వామిభక్తుడు. అందుచేత దుర్యోధనుని హృదయ వ్రణమునకు ఉపశమన మీయగల హృదయమొక్క కర్ణునికే యున్నది. ఇరువురి లక్ష్యమొక్కటే. అది పాండవ నాశము. ఇరువురి భవితవ్యము గూడ దాని మీదనే ఆధారపడి యున్నది. ఈ లక్ష్యసాధన దృష్టిలో నుంచుకొనియే

దుర్యోధనుడు కర్ణునికి సాయము చేసినాడు. ఈ లక్ష్యసాధన కొరకే కర్ణుడు మున్ముందు సాయముచేయ మైత్రిని ధారపోసినాడు. మంచిచెడ్డలను విస్మరించి, స్వామిభక్తినే స్మరించి, అన్ని విషయములలో సుయోధనుని అనుసరించి ప్రోత్సహించుట తన కర్తవ్యముగ నిర్ణయించుకొన్నాడు. కర్ణుని జీవితములో నేర్పడిన పరిస్థితులట్టివి; మనస్తత్త్వ మట్టిది. వీనిని గుర్తించక **"అపకీర్తి కరములైన పాపకార్యములలో దుర్యోధనునకు సహకరించుట స్వామిభక్తి యగునా?"**[9] యని కర్ణుని విమర్శించుట అన్యాయము.

దుర్యోధనుని మనస్సులో హితమను మాటకు చోటు లేదన్న సంగతి యెవరి కర్థమైనను కాకున్నను కర్ణుని కర్థము కాకపోదు. హితము చెప్పుట యన పాండవులతో పొత్తు కుదుర్చుకొనుమని చెప్పుటయే గదా. అది జరుగని పని. పాండవులతో దుర్యోధనుని కున్నది కేవల మొక రాజ్యభాగ సమస్యగాదు. అది ఒక వైయక్తిక మానసిక సమస్య; జీవన్మరణ సమస్య. అందుచేత కర్ణుడుగూడ హితము చెప్ప బూనుకొన్నచో దుర్యోధనుని గుండె వెయ్యి వ్రయ్యలగును. ఏలన అది ఎంతో వేడెక్కియున్న అద్దము. ఏమాత్రము నీటి బొట్టు పడినను అది బ్రద్దలగునే గాని వేడి తగ్గదు. అటువంటి పని కర్ణుడు చేయడన్న విశ్వాసముతో, తన లక్ష్యసాధన కతని సామర్థ్యమే శ్రీరామరక్ష యన్న నమ్మకముతో దుర్యోధను డందరిని త్రోసిపుచ్చి, తన మనస్సుకు, మాటకు, చేతకు, కర్ణునే ఊతగా ఎన్నుకొన్నాడు. ఈ విధమైన మానసిక స్థితిలో ప్రియభాషణమే మిత్ర హితము. అందుచేతనే కర్ణుడన్ని సందర్భములలో సుయోధనుని అనుసరించినాడు. అతడాశించినట్లు ప్రియ వాక్యములు పలికి ప్రోత్సహించినాడు.

అస్త్రవిద్యా ప్రదర్శనము కర్ణుని కంగరాజ్య మిచ్చుటయే గాక, అతని జీవితములో ఒక క్రొత్త ఆదర్శమును ప్రవేశపెట్టినది. అదే స్వామిభక్తి. ఇది మొదలు కర్ణుని జీవితము రెండా దర్శములకు కట్టువడినది–ఒకటి, మొదటి నుండి యున్న దానవ్రతము; మరొకటి, మధ్య వచ్చిన ఈ స్వామిభక్తి. ఈ రెండును అతనిని విషమ పరీక్షలకు గురిచేసినవి. అతని జీవితమును విషాదాంతముఖము గావించినవి.

అంతేగాదు, అస్త్రవిద్యా ప్రదర్శనలో తాత్కాలిక లాభము గడించిన కర్ణుని అర్జునమాత్సర్య స్వాతిశయ తత్త్వములు శాశ్వత ప్రోత్సాహమును పొందినవి. అతని సుగుణములను గూడ కళంకితము గావించినవి. అహంకారమును పెంచినవి. శాపములను సంక్రమింపజేసినవి.

మాత్సర్యము ప్రత్యర్థి బలవంతుడగుటను ఏ మాత్రము సహింపలేదు. ప్రత్యర్థి నతిశయింపవలెనని, కనీస మతనితో సమానము గావలెనని ఉబలాటపడును. ఒక్కొక్కసారి అందు కడ్డుత్రోవలు త్రొక్కి ఆపదల పాలగును.

కర్ణుడు పార్థునికి ప్రతిగా బ్రహ్మాస్త్రమును సాధింపవలెనని తపన పడినాడు. అస్త్రవిద్యాచార్యుని జేరి, **"యేను సమరంబున సవ్యసాచికి సమానుండనగుట కోరి వచ్చితి"**[10] నని చెప్పి బ్రహ్మాస్త్ర మిమ్మని ప్రార్థించినాడు. ఆచార్యుడందుకు నిరాకరింప, అబద్ధమాడుటకైన పాల్పడి పరశురాముని జేరి భృగువంశ బ్రాహ్మణుడనని బొంకి బ్రహ్మాస్త్రమును పొందినాడు. చివరకు శాపగ్రస్తుడైనాడు.

అనృతమాడుట కర్ణుని నైజగుణము గాదు. **"అనృతమున కెంత వెఱతునో విను మంతకునకును నంత వెఱవ"**[11] నన్నది అతని వ్రతము. అయినను అర్జున మాత్సర్య స్వాతిశయ తత్త్వము లాతనిచే అనృత మాడించినవి. ఇట్టి అనృతము వలన వ్రతము చెడునే గాని ఫలము దక్కదు.

అట్లే పెద్దలను తూలనాడుట గూడ కర్ణుని పుట్టుగుణము గాదు. విశేషించి అతడు వృద్ధజనోపసేవి. కాని ద్రౌపదీ వివాహానంతరము పాండవుల మీదికి తాను ప్రతిపాదించిన దండయాత్రా ప్రయత్నమును వ్యతిరేకించి సంధి ప్రయత్నము చేయబూనిన భీష్మ ద్రోణుల నిందించినాడు.[12] ఉత్తర గోగ్రహణ సమయమున పార్థుని ప్రశంసించు పెద్దలను దారుణముగ తూలనాడినాడు. స్వాతిశయమును చాటినాడు.[13]

కర్ణుని అభ్యుదయమునకు కురుపాండవ వైరమే మూలకందము. అర్జునునిపై అతని మాత్సర్యము తీరుటకు, అతనిని తక్కువగా చూచు సంఘమునకు బుద్ధి వచ్చునట్లు గొప్పతనమును ప్రదర్శించుటకు, అతని నుద్ధరించి మహోపకారమొనర్చిన రారాజు ఋణము తీర్చుకొనుటకు, ఆనాటి సంఘమున ఒక ప్రముఖ వ్యక్తిగా వెలుగుటకు అవకాశమిచ్చునది కురుపాడవ వైరమే. కురుపాండవ వైరమే లేనినాడు కర్ణుడే లేడు. కాని భీష్మద్రోణ విదురాది వృద్ధు లందరు కౌరవులను పాండవులను కలుప ప్రయత్నించు వారు. ఆ ప్రయత్నము కర్ణుని గొంతు పిసుకుట వంటిది. అందుచేతనే అతడు దానిని ప్రతిఘటించినాడు. పెక్కు విధముల చెడగొట్టినాడు. అవసరమైనపుడు స్వాతి శయమును ప్రదర్శించి ఆ పెద్దల తూలనాడినాడు. అంతే గాని కర్ణుడు గుణమెరుగని గ్రుడ్డికాడు, మర్యాద తెలియని మూర్ఖుడు గాడు. ఉదాత్తతయే లేని నీచుడు గాడు.

ప్రత్యర్థి కష్టముల పాలగుట చూచి మత్సరగ్రస్తుడు ఆనంద మొందుట మానవ స్వభావ సహజము. అంతేగాక ప్రత్యర్థి యెదుట తన ప్రాభవమును ప్రదర్శింపవలెనని మత్సరగ్రస్తుడు ఉబలాట పడును. అదను లభించినచో అతని నంత మొందించుటకే ప్రయత్నించును. అరణ్యవాసమున నున్న పాండవుల మీదికి మొదట కర్ణుడు దండయాత్రనే సంకల్పించినాడు. వ్యాసమహర్షి దానిని వారించుటతో అతడు పథకమును మార్చి ఘోషయాత్ర యని పేరుపెట్టి పెద్దల కన్నుగప్పినాడు. పాండవులున్న కానలకు వెళ్ళి పార్థుని యెదుట – అంగరాజ్యాధిపతిగా, రారాజు అనుంగు చెలికాడుగా తన వైభవమును ప్రదర్శించి; అతడు కుమిలి పోవుచుండ తా నానందింప దలచినాడు. దుర్యోధనుని ఘోషయాత్రకు పురికొల్పినాడు.

**"నారలు గట్టి కూరలశనంబుగ నుగ్రవనంబులో విప**
**ద్భారము నొంది వందురిన ఫల్గును నుజ్జ్వల రాజ్యవైభవో**
**దారులమై కనుంగొని ముదంబును బొందగఁగాంచుకంటెనిం**
**పారగ నొందు గల్గునె కృతార్థత యెందును గౌరవేశ్వరా!"**[14]

–యనునది కర్ణుని హృదయము

కాని కథ అడ్డము తిరిగినది. కర్ణుడు అర్జునునికి తన గొప్పతనమును ప్రదర్శించుట జరుగలేదు సరిగదా చిత్రసేనునిచేత చావుదెబ్బలు తిని బ్రదుకు జీవుడాయని పారిపోవలసి వచ్చినది. పాపము! దుర్యోధనుడు అనుజులతో, అనుచరులతో, అంతఃపుర కాంతలతో చిత్రసేనుని చేత బంధితుడు కావలసి వచ్చినది. ఇప్పట్టున కర్ణుడు కదనరంగము నుండి తొలగిపోవుట విమర్శకు గురిగాక తప్పదు.

"ప్రబలుడైన ప్రత్యర్థితో ప్రభువు పెనగుచుండగ అతనిని నడియుద్ధమున వదలివేసి కర్ణుడు చల్లగా తప్పుకొనినాడే! అది శూరధర్మమా? ప్రభుహిత ధర్మమా!"[15] అనునది ఒక పండిత విమర్శ.

కాని కర్ణుడు శక్తివంచన లేకుండ చిత్రరథునితో పోరినాడు.

**"రాధేయుం డజేయుండై కులశైలంబునుం బోలెఁ దరలక నిలిచి, గంధర్వులు గురియు శరవర్షంబున మునుఁగుచుఁ దన యోపినంత పెనంగుచుండ నొక్కుమ్మడిగ గంధర్వులు విజృంభించి కర్ణుని విరథునిం గావించుట"**[16] జరిగినది. అప్పుడింకను పోరినచో చచ్చుట తప్ప సాధింపదగిన ప్రయోజన ముండదు. అందుచేతనే అతడు ప్రక్కకు తప్పుకొన్నాడు. అది రణ వివేకమగునేమొ గాని, మిత్ర వంచనముగాదు.

ఆప్తమిత్రుని అనుచిత కృత్యమునకు పురికొల్పి, అతడవమానముల పాలై ఆత్మహత్యకు పూనుకొన్నప్పుడు ఆవేదన పొందుట మానవ సహజము. అతని నోదార్చుటకు ప్రియవాక్యములు పలుకుట, ప్రతిజ్ఞలు చేయుట జరుగును. చిత్రసేనుని చేతిలో చావు దెబ్బలు తిని, పాండవుల దయవలన బ్రదికి బయటపడి, ప్రాయోపవేశమునకు పూనుకొన్న దుర్యోధనుని ఓదార్చుటకు కర్ణుడెన్నో ప్రియవాక్యములు పలికినాడు. కడకు

**"మది నర్జునుఁ జూచి భయం**

**బొదవినయది నీకు; వాని నుగ్రరణమునం**

**బదునాలవ యేడు జయిం**

**చెద! నాయుధమంటి ప్రతిన సేసితి నధిపా!"**[17]

అని ప్రతిజ్ఞ చేసినాడు.

శక్తి సామర్థ్యములతోపాటు ఆత్మాభిమానము గూడ తీవ్రముగ రగుల్కొన్నప్పుడు గాని మానవుడు మహత్తర కార్యములు సాధింపలేడు. పొగడ్త పరిహాసము రెండును మానవ స్వభావమున అభిమానమును రెచ్చగొట్టునట్టివే. మహాకార్య సాధనకు మానవుని పురికొల్పునట్టివే. ఘోషయాత్రలో ఘోరావమానములపాలై, ఎట్టకేలకేదో విధమున ఇల్లు చేరిన కర్ణదుర్యోధనులను భీష్ముడు గాటుగ ఎగతాళి చేసినాడు. ప్రత్యేకించి– **"ఈ కావరుఁ గష్ట చిత్తు నధికంబుగ నమ్ముదు వీవు; వీని బాహావిభవంబు గయ్యమున నక్కడఁ జూచితె కన్నులారఁగన్?"**[18] – అని కర్ణుని పరిహసించినాడు. పాండవ బలమును ప్రశంసించి అందులో **"పదాఅవ పాలుఁ బోలఁ డీ వాయపు రజ్జులాడు"**[19] అని అతనిని కించపరిచినాడు. కర్ణుని అభిమానమునకు 'కొరడా' దెబ్బలు తగిలినట్లయినది. ఇక అతడు తన శక్తి సామర్థ్యములు నిరూపించుకొనక తప్పదు. అప్పుడుగాని అతడు దుర్యోధనుని విశ్వాసమును నిలుపుకొనలేడు. కురు పితామహుని ముందు తలయెత్తుకొని నిలువలేడు. పదిమంది యెదుట గౌరవముగ బ్రదుకలేడు. అందుచేతనే కర్ణుడొక్క ఊపున దండెత్తి ద్రుపద, భగదత్త, అంగ, వంగ, కళింగాది మహారాజుల ననేకుల జయించినాడు. తనలో పదాఅవ వంతునకు పాండవులు పనికిరారని కౌరవుల నోట పలికించినాడు. నడుము గట్టి నిలబడి దుర్యోధనునిచే రాజసూయమునకు పోటీగా వైష్ణవ మహాయాగమును జరిపించినాడు. పాండవుల జయించి రాజసూయము చేయుమని దుర్యోధనుని ప్రోత్సహించినాడు. **"అది యెమ్మెయి నగునో యని, మదిలో వగవంగ వలదు మఘవతనూజుం, గదనంబునఁ జంపక యే, పదనఖధావన మొనర్పఁ బార్థివ ముఖ్యా!"**[20] యని భీకర ప్రతిజ్ఞ చేసినాడు. అంతటి రారాజు చేత **"నీ సహాయత గలుగఁ బాండవుల నోర్చు టెంతపని మహాత్మ!"**[21] యని పలికించుకొన్నాడు. ఒక్క ఊర్పు వదలినాడు.

దిగ్విజయయాత్రతో కర్ణుని స్థాయి దేదీప్యమానముగ పెరిగినది. అంతటి రారాజు 'మహాత్మ!' అని సంబోధించుటయే అందుకు నిదర్శనము. తన పక్షమున ఎవ్వరున్నను లేకున్నను, కడకు భీష్మద్రోణాదులు గూడ ఆవలికి తొలగి వెళ్ళినను, కర్ణుడొక్కడే పాండవుల పరిమార్చగలడని, విజయలక్ష్మిని తనచేత నుంచగలడని దుర్యోధనుడు విశ్వసించినాడు. తదనుగుణముగ దుర్యోధనుని హృదయముపై కర్ణుని పట్టు బలపడినది. పాండవులలో కృష్ణున కేర్పడిన స్థానము, కౌరవులలో కర్ణున కిప్పు డబ్బినది. కౌరవపక్షమున కార్యనిర్ణేత కర్ణుడైనాడు. కర్ణుని తల భారతమైనది.

కర్ణుని శక్తిసామర్థ్యములు, అర్జున మాత్సర్య స్వాతిశయ తత్త్వములు అంతకంతకు ఫలప్రదములై కురుపాండవ సంధి సభలో అతడు రారాజు ప్రక్కన అర్ధాసన మలంకరించునట్లు చేసినవి. సూతపుత్రుడని చిన్నచూపు చూచిన సంఘమునకు బుద్ధి వచ్చునట్లు ప్రవర్తించినవి. భీష్మ ద్రోణాదులను గూడ ప్రతిఘటించి శ్రీకృష్ణుని సంధి ప్రయత్నముల చెడగొట్టెనని కర్ణుని విమర్శించుట కేవలము పరిస్థితులను, మనః ప్రకృతులను గుర్తెరుంగని మాట. కర్ణ దుర్యోధనుల మనుగడకు, మనస్తత్త్వమునకు సంధి చెడుట అవసరము. సమరమే వారి లక్ష్యము. అన్ని సంధి సందర్భములలో కర్ణుని నోట పలికినది దుర్యోధనుని హృదయమే!

కాని భీష్ముడు బ్రదికినంతకాలము కత్తిపట్టనని కర్ణుడు ప్రతిజ్ఞ చేయుట ఒక చిత్రమైన సంఘటన. దీనివలన దుర్యోధనునకు తీవ్రనష్టము కలుగునని కూడ కర్ణుడు గుర్తింపలేదు. ఆవేశముతో ఆ ప్రతిజ్ఞ చేసినాడు. ఒక ప్రయోజనము నాశించి మొదటినుండి పరిస్థితుల మలచు

కొని, ఆ ప్రయోజనము సిద్ధింపనున్న సమయమున ఎవ్వరైన గట్టిగ అడ్డుపడినచో వారి మీద విపరీత కోపము వచ్చుట మానవస్వభావ సహజము. కర్ణుడు తన ప్రతిభ నుపయోగించి మొదటినుండి పరిస్థితుల మహా సంగ్రామమున కనువుగ మలచుకొన్నాడు. దుర్యోధనుని హృదయమున ఉన్నతస్థాన మార్జించుకొన్నాడు. ఇట్టి స్థితిలో భీష్ముడు తన్ను తక్కువ చేసి, తన వీరాలాపముల విమర్శించి 'నీ విట్లు పలుకట సుయోధనుని చావున కోర్చుట గాదె' యని 'నిలదీసి' యడుగుటతో కర్ణుని కాయువుపట్టు అదిరినట్లయినది. భీష్ముని వ్యక్తిత్వము ముందు కర్ణుని వ్యక్తిత్వము నిలువలేకపోయినది. పితామహుని ధర్మబలము ముందు కౌరవసఖుని మాటబలము ఆగలేకపోయినది. అందుచేత, ఊపిరాడక ఆవేశముతో విచక్షణ గోల్పోయి–

**"నీకు నాలావు తోడ్పాటు లేకయుండ**
**వలయు నీ తెగునంతకుఁ గలన నిలువ**
**నాయుధంబులు విడిచితి నంత మీఁద**
**మెఱసి బలవిక్రమంబులు నెఱపు వాఁడ"**[22]

నని కర్ణుడు పనికిమాలిన ప్రతిజ్ఞ చేసినాడు. పాలకుండ నెత్తి పగవాని మీద కొట్టినట్లయినది!

మొత్తము మీద ఎవ్వరెన్ని మాటాడినను కర్ణుడు కౌరవులకు కొండంత అపుగా కన్పించినాడు. దుర్యోధనుని హృదయము ననుసరించినాడు. చేతనైనంత వరకు కురు పాండవ సంధి ప్రయత్నమును చెడగొట్టినాడు. మహాభారత సంగ్రామమునకు మార్గమును మలచినాడు.

శ్రీకృష్ణుని రాయబారము తరువాత కర్ణుని జీవితము విషాదముఖమైనది. అతడు విషాదాంత నాయకుడు (Tragic Hero) అయినాడు.

విషాదాంత నాయకుడు గుణశోభితుడే యయ్యు జన్మసిద్ధమైన ఒక లోపముచే గాని, పరిస్థితుల ప్రాబల్యము వలన గలిగిన స్వభావ వక్రతచే గాని, ఒక్కొక్కప్పుడు జీవితములో తప్పటడుగు వేయును. ఆ తప్పటడుగు పాలకడవలో పడిన విషబిందువువలె అతని ప్రజ్ఞల వ్యర్థ మొనరించును. అతని సుగుణ సంపదను కళంకితము గావించును. అతని జీవితమునే విషాదాంతము చేయును. అది అతని దురదృష్టము. ప్రసిద్ధ విషాదాంత నాయకుడైన 'హామ్లెట్' (Hamlet)నోట షేక్స్పియర్ మహాకవి పలికించిన వాక్యములు పై అభిప్రాయములకు దర్పణములు.

"So, oft it chances in particular men;
That for some vicious mole of nature in them
As in their birth-wherein they are not guilty.
Since nature cannot choose his origin-
By the overgrowth of some complextion,
Oft breaking down the pales and forts of reason.
Or by some habit that too much O' erleavens.
The form of plausive manners, that these men,
Carrying, I say, the stamp of one defect,
Being nature's livery, or fortune's star, -
Their virtues else, be they as pure as grace,
As infinite as man may undergo,
Shall in the general censure take corruption
From that Particular fault: the dram of base
Foth all the noble substance often doubt
To his own scandal."[23]

కర్ణుడుదాత్తుడు. ఉత్తమగుణశోభితుడు. కాని దురదృష్ట జాతకుడు. భీష్ముడన్నట్లు అతని ఉదయము దైవిక గర్భాయత్తము. మర్త్యులతని కసదృక్షులు. అయినను ఒక సూతపుత్రుడుగ అతడు జీవితము ప్రారంభింపవలసి వచ్చినది. అంతేగాక పరిస్థితులు ప్రాబల్యముచే అతని స్వభావమున అర్జున మాత్సర్య స్వాతిశయతత్త్వము లనెడి వక్రత లేర్పడినవి. పాండవులు తనకు తమ్ములనియు, అర్జున మాత్సర్య మనర్థ దాయకమనియు అతడు గుర్తించునప్పటికి పరిస్థితులు విషమించినవి. కురుపాండవ వైరమును లెస్సగ రగిల్చినాడు; పాండవుల కెన్నో అపకారములు చేసినాడు;

దుర్యోధనుని కెంతో ఋణపడినాడు.

విషాదాంత మరణమునకంటె అంతర సంఘర్షణమే వ్యక్తిని విషాదాంత నాయకుని చేయును. ధర్మాధర్మములలో దేనిని స్వీకరింపవలెనన్నది వ్యక్తికి సమస్యగాదు. ధర్మమును స్వీకరింపవచ్చును. అధర్మమును త్రోసిపుచ్చవచ్చును. రెండు అదర్మములు ఎదురైనను సమస్యలేదు. రెంటిని విడువవచ్చును. రెండు ధర్మము లెదురైనపుడే వ్యక్తికి పెను సమస్య. అవి పరస్పర విరుద్ధములు గాక సమన్వయ సాధ్యములైనచో కొంత మేలు. ఒకదాని వెంట నొకటి స్వీకరించి సమన్వయమును సాధింపవచ్చును. జీవితమును సుఖాంతము చేసికొనవచ్చును. అవి రెండును పరస్పర విరుద్ధములై ఒకదానిని స్వీకరించిన మరొక దానికి క్షతి గలుగునపుడే చిత్తసంక్షోభ మేర్పడును. దేనిని స్వీకరింపవలె నన్నది జీవన్మరణ సమస్య యగును.

"To be, or not be, that is the question"[24] అను 'హామ్లెట్' స్థితి యేర్పడును. మంచిచెడ్డల మధ్యగాక, పరస్పర విరుద్ధములైన ఒక మంచికి మరొక మంచికి మధ్య జరుగు సంఘర్షణమే సహజమైన విషాదాంత నాటక సంఘర్షణమని తెలుపు పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయము ఉపాదేయము.

"The characteristic struggle in tragedy is between rival ethical claims: good is set up against good; and the choice is not between good and evil, but between one good and another."[25]

విషాదాంత నాయకుని అంతర సంఘర్షణము, అందుకు కారణభూతములైన సన్నివేశములు, ఎట్టకేలకు వాని ఫలముగ సంభవించు విషాదాంత మరణము, సహృదయులలో కరుణ సంత్రాసముల రేకెత్తించును. అయ్యోపాప మనిపించును.

రాయబారము విఫలమైన తరువాత శ్రీకృష్ణుడు వెనుదిరిగి వెళ్ళుచు, చేయిచాపి రాధేయుని తన రథమెక్కించుకొన్నాడు. కొంత దూరము కొనిపోయి ఏకాంతమున అతని జన్మరహస్యము చెప్పినాడు. సార్వభౌమయోగము, పాంచాలి పొందు లభించునని ఆశపెట్టినాడు. పాండవ పక్షమునకు రమ్మని పిలిచినాడు. సోదర సంబంధము, సార్వభౌమ యోగము, పాంచాలీ సంగమము రాధేయు నొకవైపు పిలిచినవి. పెంచి పెద్దచేసిన రాధాతిరథుల పట్లనున్న పుత్రధర్మము, అంగరాజ్యమిచ్చి ఆదరించి తన్నింత వానిని చేసిన సుయోధనుని మీదనున్న స్వామిభక్తి మరొకవైపు లాగినవి. కర్ణుని హృదయమున ఇది గొప్ప సంఘర్షణ. చివరికాతడు పాంచాలి పొందును, సార్వభౌమయోగమును కాలదన్నినాడు. సోదరప్రేమను జయించినాడు. **"ఈ సమర సముద్రంబు దఱియనీఁది నిన్నుం గనియెదఁ, గాదేని యూర్ధ్వలోకంబునం గాంచెద, నీవింక నేమియుం బలుకకుము"** అని శ్రీకృష్ణునితో చెప్పినాడు. ఈ నిర్ణయము వెనుక ఆ వ్యక్తి మానసిక సంక్షోభమెంత యున్నదో వర్ణితము గాకున్నను పాఠకుని భావన కందకపోదు.

కర్ణుని జీవితములో ఇంతకంటె బలమైన సన్నివేశము కన్నతల్లి వచ్చి, జన్మరహస్యమును చెప్పి, పాండవ పక్షమునకు రమ్మని కోరుట; పుత్రభిక్ష పెట్టుమని అర్థించుట. ఒకవైపు చేయిచాపి యాచించు మాతృమూర్తి – మరొకవైపు చేయూతనిచ్చి తన్ను పైకితెచ్చిన కౌరవపతి. కర్ణుని హృదయము కలత పడకుండునా? అయినను కర్ణుడిట కన్నతల్లి ప్రార్థనకు, కౌరవేశ్వరుని కోరికకు సమన్వయము సాధించినాడు. అర్జునుని తప్ప తక్కిన పాండవుల హతమార్పనని తల్లికిమాట యిచ్చినాడు. పార్థుని పరిమార్తునని కౌరవేశ్వరునికిచ్చిన మాట దక్కించుకొన్నాడు. అయినను కుంతికిచ్చిన వరము కదనరంగమున కర్ణుని కాలుసేతుల కొంత కట్టివేయునట్టిదే.

సోదర ప్రేమకు, స్వామిభక్తికి మధ్య కర్ణుడు నలిగిన మూడవ ఘట్టము కర్ణ భీష్మ సమావేశము. అంపశయ్య మీద గాంగేయుడు కర్ణుని చేరదీసినాడు. జన్మరహస్యము

చెప్పినాడు. సోదరప్రేమ రగిలించినాడు. కౌంతేయుల కలియుమన్నాడు. ఈ హితము గూడ కర్ణుని అంత రంగమున అలజడిని కలిగించునదే. అయినను అతడు స్వామిభక్తినే స్వీకరించినాడు. పరిస్థితులను వివరించి **"భూరి వివేక! యే విడిచిపోవుట ధర్మమె? వీరకర్మమే?"**[27] యని సమాధానము చెప్పి సమరమున దూకినాడు.

కర్ణుని స్వామిభక్తికి నికషోపలము వంటిది, అతని ఆంతర సంఘర్షణకు శిఖరప్రాయమైనది ఇంతకు ముందొకటి జరిగినది. అదే కవచకుండల దానము. కపట బ్రాహ్మణ రూపమున కవచకుండలము లర్థించుచు దేవేంద్రు డొకవైపు నిలిచినాడు. అవి యిచ్చినచో అర్జునుని జయింపలేవని జన్మనిచ్చిన కర్మసాక్షి ఇంకొకవైపు ఘోషించినాడు. ఏమి చేయవలె? ఇచ్చినచో స్వామిభక్తికి దెబ్బ. ఈయకున్నచో దానవ్రతమునకు మచ్చ. ఇచ్చుటెట్లు? ఈయకుండుటెట్లు? కర్ణుని అంతరంగమే గాదు, ఏ వ్యక్తి అంతరంగమైన ఇట్టి ఘట్టములలో తీవ్రసంఘర్షణకు లోనుగాక తప్పదు.

మానవ స్వభావమున పరిస్థితులు తెచ్చిపెట్టిన ఆదర్శము కంటె సహజసిద్ధమైన జన్మవ్రతము బలవత్తరము. కర్ణుని దానగుణము సహజసిద్ధమైన జన్మవ్రతము. అతని స్వామిభక్తి కేవలము పరిస్థితులు తెచ్చిపెట్టిన ఆదర్శము. పైగా అది ఆంజనేయుని రామభక్తివలె ప్రభువు సుగుణ సంపత్తిని జూచి పులకించి పొంగిపొరలినదిగాదు. తాను పొందిన లాభమునకు కృతజ్ఞతారూపమున పుట్టినట్టిది. అయినను ఎంతో పుట్టుబలము కలది గనుక ఎన్నో పరీక్షల తట్టుకొని నిలిచినది. కాని కర్ణుని దానవ్రతమును జయింపలేకపోయినది. అందుచేతనే కర్ణుడు కవచ కుండలములు కోసియిచ్చినాడు. ఇంతలో ఆ స్వామిభక్తి పైకి పొంగినది. దేవేంద్రుని ప్రతిదానమడిగినది. దాన పవిత్రతను తగ్గించినది. కర్ణుడు రెంటికి చెడిన రేవడి అయినాడు. అతని జీవితము విషాదాంతముఖమైనది.

విషాదాంతనాయకు లవివేకులు గారు; అసమర్థు లంతకంటె గారు. వారు గొప్ప వివేకులు; కడు సమర్థులు. కర్ణుడెంత సమర్థుడో అంత వివేకి. పైగా స్వశక్తితో సూతపుత్ర స్థితినుండి రారాజు అర్ధాసన మలంకరించు స్థితి కెదిగినాడు. అందుచేత వ్యక్తులను గూర్చి, పరిస్థితులను గూర్చి ఇతనికున్న అవగాహన అన్యులకుండదు. పరిస్థితుల ప్రాబల్యముచే కర్ణుడు కౌరవపక్షమునకు కట్టుపడినను, అతడు పాండవ బలమును లెక్కగట్టలేనివాడు గాదు. ధర్మజుని ధార్మికతను తెలియనివాడు గాదు. శ్రీకృష్ణుని ప్రాపును, పాండవ విజయమును భావింపలేనివాడు గాదు. అపార వివేకముతో, అచ్చపు సహృదయతతో అప్పుడప్పుడు కర్ణుడాడిన మాటలకు అపార్థములు కల్పించి – "పరమమిత్రుని వలె వర్తించుచు, దుర్యోధనుని దురమునకు దింపి, యతని కులవృక్షమును కూలద్రోయ పొంచువేసికొని యున్నవాడని"[28] "అర్జును నెదిరించిననే గాని తనకు మరణము రాదు. తాను మరణించిననే గాని దుర్యోధనుడు పొలియడు. అతడు పొలిసిననేగాని ధర్మసుతుడు ధరణీపతి గాడు. అతడు చక్రవర్తి యగుటయే గదా కర్ణుని కాంక్షితమని"[29] "తమ్ముల రాజ్యలబ్ధి కొరకు తనువును తృణీకరించిన త్యాగమూర్తి యనిపించుకొనవలెనని కర్ణుని కోరిక"[30] యని పండితులు విమర్శించుట అన్యాయము. ఎదుటివారు తమకంటె సమర్థులని తెలిసి, వారిచేత తమకు నాశము తప్పదని తెలిసి, శ్రీకృష్ణుడు చూపిన ఆశలను, కన్నతల్లి అభ్యర్థనను, కురుపితామహుని హితమును త్రోసిపుచ్చి, సోదర ప్రేమను జయించి, కర్తవ్యనిరతుడై స్వామిభక్తితో సమరభూమికి నడిచిన కర్ణుడు ప్రశంసార్హుడు గాని పరివాదార్హుడు గాదు. పైగా కర్ణుడు ఏకాంతమున అనవలసినచోట, అనదగిన వారితో, అనవలసినప్పుడు పాండవుల బలమునుగూర్చి పలికినాడు. వారి గుణములను కొనియాడినాడు. అతడు విశిష్ట వ్యక్తిత్వముగల ప్రభుభక్తి పరాయణుడుగాని, వ్యక్తిత్వము అంతకంటె లేక ఆత్మాభిమానము నమ్ముకొన్న బానిస గాదు. గుణమెరుగని గ్రుడ్డికాదు.

యుద్ధభూమిలో గూడ కర్ణుడు ప్రదర్శించిన వివేక

మనుపమానము. ఏదో సులభసాధ్యమన్నట్లు సుయోధనుడు ద్రోణునితో భీముని చంపుమని పలుకుచుండ, కర్ణుడు కలుగ చేసికొని భీముని బలపరాక్రమములను వర్ణించి కర్తవ్యమును తెలియజెప్పినాడు. సైంధవుడు మరణించి నందులకు దుర్యోధనుడు ద్రోణుని నిందించుచుండ, కర్ణుడు జోక్యము పుచ్చుకొని –

**"... ... ... అగ్గురు దూఱఁగ నేల? యాతఁడో**
**పినటుల పోరుఁగాక, బీరము లావును నెక్కుడైన వా**
**ని నడుప వచ్చునే? విధియ నేర్చు, విషంబిడి,**
**యిల్లుగాల్చి, కా**
**ననమున కేఁగఁజేసి, యొక నాశముఁగంటిమె**
**గొంతిసంతతిన్?**
**కావున మన సైంధవుని, దైవమ తెగటార్చె"[31]**

నని మందలించినాడు. వివేకము జూపినాడు.

భీష్మ పతనానంతరము సైన్యాధిపతి నిర్ణయింపుమని సుయోధనుడు తన్నడుగ, తాను సైన్యాధిపతి కావలెనన్న కోరిక కలవాడయ్యు, ఎంతో వివేకముగ

**"అధిప! నీ యోధులందు సేనాపతి**
**త్వమునకుఁ జాలనివారు గలరె?**
**యందఱు నయవిక్రమాది గుణంబుల**
**మాననీయుల, యట్టులైన నెల్ల**
**వారి ముఖ్యులఁ జేయవచ్చునే? యొక్కరు**
**గైకొన్న మత్సరగ్రస్త బుద్ధి**
**నన్యులు విపరీతులై కలంగక యుండు**
**వారు గావలయు, నెవ్వరును ద్రోణుఁ**
**డనినఁ గాదన, రాతండ యర్హుఁ డాధి**
**పత్యమునకు, నాచార్యుండు బ్రాహ్మణుండు,**
**వివిధ రణ కోవిదుఁడు, వయోవృద్ధుఁ, డధిక**
**బలుఁడు, శూరుండు, గట్టుము పట్ట మతని(కి)"[32]**

అని పలుకుట గమనింపదగినది.

ఇంత వివేకమున్న కర్ణుడు జీవితము నేల విషాదాంతము చేసికొనెనని సందేహము కలుగును. అందుకు కారణములు: (1) అతని వైయక్తిక లోపములైన అర్జునమాత్సర్య స్వాతిశయ తత్త్వములు, (2) పరిస్థితుల ప్రాబల్యము, (3) దురదృష్టము. ఈ అర్జున మాత్సర్య స్వాతిశయతత్త్వములు కూడ పరిస్థితుల ప్రభావము వల్లనే అతని స్వభావమున నెలకొన్నవి. అవి తాత్కాలికముగ అతనికి అంగరాజ్యము నిచ్చినను, రారాజు ప్రక్కన అర్ధాసనము నొసగినను, అతనిని అధర్మపక్షమైన కౌరవ పక్షమునకు కట్టివేసినవి. విషాదాంత నాయకుని బలహీనతలుగా రూపొందినవి. అతని జీవితమును విషాదాంతము చేసినవి.

కర్ణునకి వివేకోదయమై మంచి చెడ్డలు, లాభనష్టములు తెలియునాటికి పరిస్థితులు విషమించినవి. కర్ణుడు కౌరవపక్షమున చేరి కురుపాండవ కక్షలు పెంచినాడు. దుర్యోధనుడు తనపై ఆధారపడునట్లు చేసినాడు. తాను స్వామిభక్తికి పూర్తిగ బద్ధుడైనాడు. పాండవుల కెన్నో అపకారములు చేసినాడు. ఇట్టి తరుణమున పాండవులు తన అనుజులని తెలిసినను ప్రయోజనమేమున్నది? కౌరవపక్షమును విడుచుటెట్లు? స్వామిభక్తిని కాలదన్నుటెట్లు? అంతదూరము వెళ్ళి వెనుదిరుగు టెట్లు? పరిస్థితు లీ విధముగ పాకము దప్పుటను పరోక్షముగ కృష్ణునకు చెప్పినాడు. కుంతికి తెలిపినాడు. కురుపితామహునితో ప్రత్యక్షముగనే –

**"మాటలుపెక్కులాడి యనుమానము లేక సభం గడంగి ప**
**ల్మాటు బరాభవించితి జలంబున, పాండవకోటి కెప్పుడుం**
**జేటు దలంచి యే బలుపు సేసితి వైరము, నాకు నింక నీ**
**వీటికి వారి వీటికిని వెక్కసమయ్యెడు కయ్యమొప్పగున్"[33]**

అని వివరించినాడు. మంటకు మిక్కిలి దగ్గరగ వెళ్ళి రెక్కలు కాల్చుకొన్న మిడుత మంటలో బడి మాడిపో వలసినదేగాని వెనుదిరుగుటకు వీలుండదు.

కర్ణుడు పుట్టుకనుండియే దురదృష్టవంతుడు. కన్నతల్లిచే గంగపాలు చేయబడిన జీవితమాతనిది. అఖండ భూమండలాధీశ్వరుడు కాదగిన యోగ్యతలుండి ఒక సూతపుత్రుడుగ సమాజమున జీవితము ప్రారంభించుట

కంటె దురదృష్ట మేమున్నది? అంతేగాక పరశురామ శుశ్రూష అతనికి శాపమును ప్రాప్తింపజేసినది. అస్త్రవిద్యా సాధన బ్రాహ్మణశాపమును సంక్రమింపజేసినది. దానవ్రతము కవచకుండలముల తొలగించినది. యుద్ధభూమిలో గూడ దురదృష్టమే కర్ణుని వెన్నాడినది. అతడు సేనాధిపతిగ నుండగనే దుశ్శాసనుడు ఘోరముగ భీమునిచేత చచ్చినాడు. ఆ దుశ్శాసనుని దారుణ మరణ దృశ్యమును చూచుసరికి అంతటి కర్ణుడు **"భీతుండై వదనంబు వెలవెలఁబాఱ నూరకుండ"**[34] వలసి వచ్చినది. తన కొడుకులు సత్యసేన వృషసేనులు సమరభూమికి బలియైనారు. భీమునిచేత భంగపాటు గలిగినది. అర్జునునితో పట్టుపట్టి ద్వంద్వయుద్ధము చేయునపుడు దేవతలు, మునులు విజయము లభించునట్లు వియు నాశీర్వదించినారు. 'తాడోపేడో' తేల్చుకొనవలెనని నరునిపై వేసిన నాగాస్త్రము శల్యసారథ్య కృష్ణసారథ్యములచే గురి తప్పినది. అన్నింటిని మించి శల్యసారథ్యము మానసిక నరకమును గూర్చినది. చిట్టచివరకు పుట్టవెడలి వచ్చిన పాములవలె శాపము లన్నియు కాటువేసినవి. భార్గవాస్త్రము బుద్ధికి స్ఫురింపలేదు. రథచక్రము భూమిలో క్రుంగి పోయినది. బ్రహ్మాస్త్రము వెనుదిరిగి వచ్చినది.

చావునకు సానుభూతిని బొందు గుణమున్నది. అందును సమర్థుని చావు చాల సానుభూతిని పొందగలదు. క్రుంగిన రథచక్రము కుండమునుగ మరల క్రుంగినపుడు, అంతటి కర్ణుడు కన్నీరు గార్చుచు అరదంబు డిగ్గి

**"అరదంబు చక్రంబు ధరఁ జాలఁ గ్రుంగిన**
**నెత్తెద నంతకు నేయకుండు**
**మేను భూమిస్థుఁడ నీవు రథస్థుండ**
**వియ్యెడఁ దగవగు నేయకునికి**
**విరిదల వానిని విరథుని నాయుధం**
**బిడిన వానిని శూరు లేయ రెండు**
**మహిని శూరుఁడవను మాత్రగా దుత్తమ**
**కులుఁడవు రణధర్మ కోవిదుండ**
**విట్టి నీవు దగినయట్టి భంగిన యని**
**సేయవలయు నిట్లు సెప్పుటెల్లఁ**
**బాడి యేర్పడంగఁ బలుకుట గాని గో**
**విందునకును నీకు వెఱచి గాదు"**[35]

అని ధర్మోపన్యాసము ప్రారంభించినపుడును,

**"ధర్మవాదులు ధర్మతత్త్వ ప్రధాన**
**చిత్తులగు వారిఁ బూని రక్షించు ధర్మ**
**మందు రది బొంకుఁ గావించె నతుల ధర్మ**
**శీలుఁడగు నాకు ధర్మువు సెలవు లేద"**[36]

యని ధర్మవిరక్తిని ప్రకటించు నపుడును అయ్యో! పాప మనిపించును.

కాని మానవుడు తా నితరులకు అన్యాయము చేసినంత కాలము, అపకారము చేసినంతకాలము, తన ఆట సాగినంత కాలము నీతినియమములను లెక్కింపడు. తాను దిక్కులేక దీనుడై ప్రమాదపు గుప్పిట చిక్కినపుడే ఎన్నడులేని ధర్మదృష్టిని, న్యాయచింతను, దైవభక్తిని ప్రదర్శించును. ఈ తత్త్వమును గర్హించియే కృష్ణుడు కర్ణుడు చేసిన అన్యాయము లన్నింటిని వల్లెవేసి, వివ్వచ్చుని కవ్వించి కొట్టుమన్నాడు. చరమగిరినుండి పడియెడు తరణికరణి కర్ణుని తల తెగిపడినది.

ఇది చూచిన శల్యుడు గూడ సానుభూతితో **"విధాతృడు దప్పె వానికిన్"**[37] అని కర్ణుని దురదృష్టమును స్మరించినాడు. నారదుడు ధర్మజునితో –

**"వినుము నరేంద్ర! విప్రు దలిగెన్, జమదగ్ని సుతుండు శాపమి చ్చె, నమరభర్త వంచనము సేసె, వరంబని కోరి కుంతి మా న్చె నలుక, భీష్ముఁడర్ధరథుఁ జేసి యడంచెఁ, గలంచె మద్రరా జనుచితమాడి, శౌరి విధియయ్యె, నరుండటుఁ జంపెఁ గర్ణునిన్"**[38]

అని సానుభూతితో అతని పతన కారణముల సమీక్షించినాడు.

మొత్తము మీద, ఎంతో శక్తియుండి, సామర్థ్యముండి, ఎన్నో సద్గుణములుండి, సంఘముచే చాలకాలము చిన్నచూపు చూడబడి, పరిస్థితుల ప్రాబల్యముచే మాత్సర్య స్వాతిశయతత్త్వము లనెడి వక్రతలకు హృదయములో చోటు

నిచ్చి, విపరీతముగ విజృంభించి, తన్ను తక్కువగ చూచిన సంఘముననే ఉన్నత స్థానమును గడించి, పెంచుకొన్న పరిస్థితులకు, ఉంచుకొన్న ఆదర్శములకు మధ్య నలిగి, మొదటినుండి విధివంచితుడై, అటు సంఘనాశమునకు, ఇటు ఆత్మనాశమునకు కారణభూతుడై – "అయ్యో! పాప!" మనిపించు మరణమును పొందిన విషాదాంత నాయకుడు కర్ణుడు. విషాదాంత నాయక తత్త్వము మానవ స్వభావమున ఒక అగాధ భాగము. దానిని మహాభారతము కర్ణునిలో ప్రదర్శించినది.

**("మహాభారతము – మానవస్వభావ చిత్రణ" అను సిద్ధాంత గ్రంథమునుండి, పుటలు 186–211)**

**పాదసూచికలు**

1. భార. ఆర. ప్రథ. ప.270.
2. భార. విరా. పంచ. ప. 11
3. సం.భా. ద్రోణ. అధ్యా. 73. శ్లో.29.
4. సం.భా. ద్రోణ. అధ్యా.181. శ్లో.25.
5. సం.భా. ఉద్యోగ. అధ్యా.139. శ్లో.6–7.
6. భార. శాంతి. ప్రథ. వ.18; ఆది. పంచ. వ.225; ఆర. సప్త. వ.356.
7. భార. ఆది. షష్ఠా. ప.32.
8. భార. ఆది. షష్ఠా. ప.50.
9. మహాభారత తత్త్వ కథనము–దుష్టచతుష్టయ చర్య.పు.1241.
10. భార. శాంతి. ప్రథ. వ.18.
11. భార. ఆర. సప్త. ప.303.
12. భార. ఆది. అష్ట. ప.38.
13. భార. విరా. చతు. ప. 218–219.
14. భార. ఆర. పంచ. ప.349.
15. ద్రోణప్రశస్తి, పు.116.
16. భార. ఆర. పంచ. వ.399.
17. భార. ఆర. షష్ఠ. ప.55.
18. భార. ఆర. షష్ఠ. ప.62.
19. భార. ఆర. షష్ఠ. ప.63.
20. భార. ఆర. షష్ఠ. ప.93.
21. భార. ఆర. షష్ఠ. ప.94.
22. భార. ఉద్యో. ద్వితీ. ప.289.
23. Hamlet, Act.I.
24. Hamlet, Act.III.
25. Literary criticism, p.557.
26. భార. ఉద్యో. చతు. వ.53.
27. భార. భీష్మ. తృతీ. ప.447.
28. ద్రోణప్రశస్తి, పుట 137.
29. ద్రోణప్రశస్తి, పుట 138.
30. ద్రోణప్రశస్తి, పుట 139.
31. భార. ద్రోణ. పంచ. ప.48–49.
32. భార. ద్రోణ. ప్రథ. ప.62.
33. భార. భీష్మ. తృతీ. ప.449.
34. భార. కర్ణ. తృతీ. ప.228.
35. భార. కర్ణ. తృతీ. ప.351.
36. భార. కర్ణ. తృతీ. ప.343.
37. భార. కర్ణ. తృతీ. ప.377.
38. భార. శాంతి. ప్రథ. ప.35.

---

**ముఖ్య గమనిక:–** గుంటూరులో శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారు, వారి ధర్మపత్ని శ్రీమతి లలితాంబగారు "భారతీధార్మిక విజ్ఞాన పరిషత్తును స్థాపించి, దేశంలో ప్రసిద్ధికెక్కిన కవిపండితుల చేత మహాభారతాన్ని గురించి ఎన్నో చక్కని ఉపన్యాసాలు ఇప్పించి, వ్యాసాలు వ్రాయించి, వాటినన్నింటిని "మహాభారత వైజయంతి" అనే పేరుతో 2003–2006 మధ్య తొమ్మిది సంపుటాలుగా ప్రచురించి, సాహిత్య ప్రియులకు ఉచితంగా పంపిణీచేశారు. ముందుగా ఆ ఉత్తమ దంపతులకు నా కృతజ్ఞతా పూర్వక నమస్సులు. ఈ సంపుటాలలో శ్రీకృష్ణుడు, కర్ణుడు మొదలైన ముఖ్య పాత్రలను గురించిన ఎన్నో గొప్ప గొప్ప వ్యాసాలున్నాయి. వాటిలో నాల్గవ సంపుటంలో శ్రీ బలభద్ర పాత్రుని హనుమంతరాయశర్మగారు రచించిన "కర్ణుని ఆంతర్యము" అనే వ్యాసం ఒకటి (స్థలాభావం వల్ల దానిని ఇక్కడ ఇవ్వలేకపోయాను). దానిలో ఏకాంతంలో కలిసిన కృష్ణునితో కర్ణుడు ఇలా అంటాడు "సఏవరాజా ధర్మాత్మా శాశ్వతోఽస్తు యుధిష్ఠిరః" (ధర్మాత్ముడైన ఆ ధర్మరాజే శాశ్వతముగా ప్రభువు కాదగినవాడు) – "అధర్మిష్ఠస్య దుర్యోధనస్య రాజ్యం లోక నాశనకరం" (అధర్మాత్ముడైన దుర్యోధనునకు రాజ్యప్రాప్తి లోకానర్థకరము).

– తంగిరాల.

# ఏకలవ్యుని వృత్తాంతము

**- ఆచార్య లింగమనేని బసవ శంకరరావు**

(రామాయణంలోని వాల్మీకిని గురించి, మహాభారతం లోని ఏకలవ్యుని గురించి సాహిత్యలోకంలో కొన్ని కట్టుకథలు మిక్కిలి ప్రచారంలో ఉన్నాయి. వాల్మీకి బోయవాడని, ఏకలవ్యుడు నిషాదుడని, కాబట్టి వీళ్ళిద్దరూ గిరిజనులు (ఎస్.టి) అనీ వాదిస్తూ, వీరిని గురించి కవితలు, కథలు, కావ్యాలు, నాటకాలు వ్రాస్తూ, అగ్రవర్ణాల వారిని కించ పరుస్తూ, ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్నారు. ఓటుబ్యాంకు రాజకీయలబ్ధికోసం, ప్రభుత్వంవారు, రాజకీయ పక్షాలవారు ఈ వాదాలను సమర్థిస్తున్నారు. "వాల్మీకి జయంతి''ని జరుపుతున్నారు". "ఏకలవ్య పురస్కారం" కూడా ఏర్పాటు చేశారు. నిజానికి వాల్మీకి బ్రాహ్మణుడుగా పుట్టాడు. తరువాత కొంతకాలం బోయలలో చేరి దారిదోపిడులు, దొంగతనాలు చేస్తూ నారదునివలన జ్ఞానాన్ని పొంది, తపస్సుచేసి ఋషియై రామాయణాన్ని వ్రాశాడు. ఇక ఏకలవ్యుడు నిషాదులకు రాజు మాత్రమే. నిషాదుడుకాడు. చంద్రవంశ క్షత్రియుడు. శ్రీకృష్ణునకు సాక్షాత్తు మేనత్త కొడుకు. వసుదేవునకు ఐదుగురు చెల్లెండ్రు: "శ్రుతకీర్తి-శ్రుతదేవ-శ్రుతశ్రవ (సాత్వతి)-పృథ (కుంతి)-రాజాధిదేవి". వీరిలో ఒక్క కుంతి తప్ప, తక్కిన నలుగురికీ రాక్షసాంశతో దుర్మార్గులైన కొడుకులు పుట్టారు. శ్రుతకీర్తికి "దంతవక్త్రుడు" - శ్రుతదేవకు "ఏకలవ్యుడు" - శ్రుతశ్రవకు ''శిశుపాలుడు'' - రాజాధిదేవికి "విందానువిందులు" అనే ఇద్దరు కొడుకులు, "మిత్రవింద" అనే కూతురు పుట్టారు. (మిత్రవిందను కృష్ణుడు పెండ్లి చేసుకున్నాడు.) దంతవక్త్రుడు, ఏకలవ్యుడు, శిశుపాలుడు, విందానువిందులు క్రూరులై, అధర్మవర్తనులై, పరమ దుర్మార్గుడైన జరాసంధునితో స్నేహం చేసి, దేశంలో అల్లకల్లోలం రేపుతూ, ధర్మపరులైన రాజులను బంధించి హింసిస్తూ వచ్చారు. రుక్మిణీదేవి అన్నయైన "రుక్మి" కూడా వీరి వర్గంలోని వాడే! అందువల్ల కృష్ణుడు, బలరాముడు, భీమార్జునులు వీరినందరినీ చంపివేశారు. ధర్మరాజును చక్రవర్తిని చేశారు. కృష్ణుడు, పరమ పవిత్రులు, ధర్మశీలురు, దైవాంశ సంభూతులు అయిన కుంతీపుత్రులను కంటికి రెప్పలా కాపాడాడు. కర్ణుడు కూడా దైవాంశ సంభూతుడైన కుంతీపుత్రుడే. అతనిని పాండవపక్షానికి తెచ్చి చక్రవర్తిని చేయాలని శాయశక్తులా ప్రయత్నించాడు కృష్ణుడు. ఎంతచెప్పినా అతడు వినలేదు. కర్ణుడు అధర్మపరుడైన దుర్యోధనునితో స్నేహం చేస్తూ, పాండవులను అడుగడుగునా హింసిస్తూ వచ్చాడు. అందువల్ల అతనిని కూడా అర్జునుని చేత చంపించాడు కృష్ణుడు.-ఇదీ కథ. ఇక చదవండి.- **సంపాదకుడు.**)

వేదాలు అపౌరుషేయాలు, అజప్రోక్తాలు. తొలుత ఇవి ఏకరాశీభూతాలై ఉండేవి. పిమ్మట పరాశరాత్మజుడు వేదాల్ని విభజించి వేదవ్యాసుడయ్యాడు. వేదాలు ప్రభుసమ్మితాలు. పురాణాలు మిత్రసమ్మితాలు. కావ్యాలు కాంతాసమ్మితాలు. మహాభారతం ఇతిహాసమైనా కూడా వేదపురాణ కావ్య లక్షణాలతో విలసిల్లుతోంది. భారతీయులందరిలోకి ఆంధ్రులకు భారతం పరమ ప్రామాణిక గ్రంథం. "వింటే భారతమే వినాలి - తింటే గారెలే తినాలి" - అని సామెత. గారెలు అందరికీ ఇష్టమో లేదో కాని భారతం మాత్రం అందరికీ తేనెకంటె తీయనైంది. భారతంలో ఏముందో అదే అన్యత్రా ఉంది. భారతంలో లేనిదేదీ ఇంకెక్కడా కాగడా వేసి వెదకినా దొరకదట! చూడండి -

**శ్లో. ధర్మేచార్థే చ కామే చ-మోక్షే చ భరతర్షభ!**
**యదిహాస్తి తదన్యత్ర-యన్నేహాస్తి న తత్క్వచిత్॥**

భారతంతోపాటు మన ఆంధ్రులకేకాదు భారతీయు లందరికీ రామాయణం, భాగవతం నిత్య పారాయణ గ్రంథాలే. ఇప్పటికి పల్లెల్లో కాలక్షేపం ఈ గ్రంథాల పఠనమే. - ధీమంతుల నిత్యకృత్యం ఎలా ఉంటుందో, అధీరుల నిత్యకృత్యం ఎలా ఉంటుందో మనోజ్ఞంగా చెప్పబడింది -

**శ్లో. ప్రాతర్ద్యూత ప్రసంగేన-మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః**
**రాత్రౌ చోర ప్రసంగేన-కాలో గచ్ఛతి ధీమతామ్॥**
**(కాలో గచ్ఛత్యధీమతామ్॥)**

భారతంలో సమస్త విషయాలు ఉన్నాయంటున్నాం గదా! ఇందులో ప్రధానంగా ధర్మం, సత్యం, దయ, దానం, నీతి ఇత్యాది ఉత్తమ గుణ సంకీర్తనం ఉంది. భారతంలోని మహోదాత్తమైనటువంటి పాత్రలు మన భారతజాతి హృదయ వైశాల్యానికి, నైర్మల్యానికి, నిస్వార్థబుద్ధికి, త్యాగనిరతికి నికషోపలాలు. భీష్మద్రోణకృపకర్ణాది పాత్రలు, ధర్మజ భీమార్జునుల వంటి సత్యపరాక్రములు 'నభూతో నభవిష్యతి'. ఈ పాత్రలతో తులతూగేది ఏకలవ్య పాత్ర. ఏకలవ్యుడికి గురుభక్తి అగ్గలం -

**శ్లో. గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మా - తస్మై శ్రీ గురవే నమః॥**

అనే ఆర్యోక్తికి ఉదాహరణప్రాయుడు ఏకలవ్యుడు. ఇప్పటికీ 'ఏకలవ్య శిష్యత్వం' అనేది తెలుగువారికి నానుడి. ఏకలవ్యునివంటి శిష్యుడు ప్రపంచ కథల్లోనే అరుదు. గురువుపై అచంచల భక్తి, చిత్తశుద్ధి, గురువుకోసం సర్వస్వం అర్పించగలిగే త్యాగబుద్ధి - ఏకలవ్యుని నిలువెల్లా ఆవహించింది. ఏకలవ్యుని కథను పరిశీలిద్దాం-

కురుప్రవరుడైన భీష్ముని నియోగంతో ద్రోణాచార్యుడు కరుపాండవ కుమారులకు ధనుర్విద్యాభ్యాసం చేయిస్తున్నాడు. నానాదేశాగత రాజకుమారులు కూడా వారితోపాటు విలువిద్యనారంభించారు. అంతేగాకుండా సూతపుత్రుడుగా ప్రఖ్యాతినొందిన రాధేయుడు కర్ణుడు కూడా వారితో విలువిద్యాభ్యాసం ప్రారంభించాడు. ద్రోణాచార్యుల ప్రశస్తిని విని ధనుర్విద్యాభ్యాసార్థియై ఏకలవ్యుడు హస్తినాపురానికి వచ్చాడు. ఏకలవ్యుడు హిరణ్యధన్వుడనే ఎరుకలరాజు పుత్రుడు. ఏకలవ్యుడు నిషాదపుత్రుడవటంచేత ద్రోణుడు అతనిని శిష్యునిగా గ్రహింపలేదు. అప్పుడే ఏకలవ్యుడు అరణ్యానికి పోయి -

**తే. వినయమున ద్రోణురూపు మన్నున నమర్చి**
**దాని కతిభక్తితోడఁ బ్రదక్షిణంబు**
**జేసి మ్రొక్కుచు సంతతాభ్యాస శక్తి**
**నస్త్ర విద్యారహస్యంబులర్థిఁ బడసె (5-232)**

ఒకనాడు కురుపాండవకుమారులు ఆచార్యానుమతితో మృగయా వినోదార్థులై అడవికి వెళ్ళారు. అప్పుడొక భటుని కుక్క దారితప్పి ఏకలవ్యుని సమీపంలో మొరగటం మొదలు పెట్టింది. ఏకలవ్యుడికి పరమ చిరాకు వేసింది. అగ్రహంతో దాని ముఖంపై అత్యంతాశ్చర్య జనకంగా అతిలాఘవంతో ఏడు బాణాలు వేశాడు. కుయ్యోమొర్రో అంటూ ఆ శునకం కురుపాండవకుమారుల దగ్గరికి పారిపోయి వస్తుంది. శరపూరిత ముఖంతో ఉన్న ఆ శ్వానాన్ని చూసి వారు విస్మయం చెందారు. అలా బాణవర్షం కురిపించిన వాడెవ్వడా? అంటూ వెదుకుతూ పోయి-దృఢ దీర్ఘమలీమస కృష్ణదేహుని, కృష్ణాజిన చర్మధారుని వాళ్ళు చూశారు. వాని శరలాఘవాన్ని కొనియాడారు. "నీవెవ్వరివాడవు? నీకు గురువెవ్వరు?" అని ఏకలవ్యుని ఆ కుమారులడిగారు. ఏకలవ్యుడు చెప్పిన సమాధానం విని ఆశ్చర్యపోయారు. ఆ వింత విషయాన్ని ద్రోణునికి వెళ్ళి చెప్పారు. ఒకనాడు ద్రోణాచార్యుడు ఒంటరిగా ఉన్నప్పుడు అర్జునుడిలా విన్నవించాడు -

**క. విలువిద్య నొరులు నీక**
**గ్గలముగ లేకుండ నిన్ను గఱపుదునని మున్**
**బలికితిరి నాక కాదీ**
**త్రిలోకముల కధికు జూచితిమి యొక యెఱుకున్**
(5-239)

**క. నాకంటెను మీ కంటెను**
**లోకములో నధికు దతిబలుండు ధనుర్వి**
**ద్యాకౌశలమున నాతడు**
**మీకుం బ్రియశిష్యుడటె యమిథ్యావచనా!** (5-240)

ఈ పల్కులు విన్న ద్రోణుడు అదిరిపడ్డాడు. అర్జునుణ్ణి వెంటబెట్టుకొని అడవికి వెళ్ళాడు. అక్కడ అనవరత శరాసనాభ్యాసనిరతుడైయున్న ఏకలవ్యుని కన్నులారా గాంచాడు. ఏకలవ్యుడు ఆచార్యునకు నమస్కరించి వినయంతో తాను శిష్యుడనని విన్నవించుకొన్నాడు. అంతకుముందే ఆచార్యుడు అర్జునున కిచ్చిన మాటను నిలబెట్టుకోవాలనే తపనతో విచక్షణాజ్ఞానం కోల్పోయి ఏకలవ్యుణ్ణి గురుదక్షిణ సమర్పించ వలసిందిగా కోరాడు. మహా సంతోషంతో ఏకలవ్యుడు -

ఇదె దేహం బిదె యర్థంబు ఏ యది మీ కిష్టమో కోరుకొమ్మన్నాడు. తన మాట నిలబెట్టుకోవటంకోసం ద్రోణుడు ఇసుమంతైనా కనికరం లేకుండా –

**క. నెమ్మిని నీ దక్షిణ హ**
**స్తమ్మున పెనువ్రేలు దునిమి దక్షిణ యిమ్మి**
**ష్టమ్మిది నా కనవుడు విన**
**యమ్మున వాడిచ్చె దాని నాచార్యునకున్** (5–243)

దక్షిణాంగుష్ఠ నష్ట కారణంగా ఏకలవ్యుడు ధనుర్విద్యా కల్మికి హీనుడయ్యాడు. గురువడిగింది ఇలా ఇచ్చివేసి గురుఋణం తీర్చుకొన్న శిష్యుడు ఏకలవ్యుడులాంటి వాడింకొకడున్నాడా? తర్వాత ఏకలవ్యుడేమైనాడు? వాని అనంతర వృత్తాంతం ఏమిటి?

ద్రోణపర్వంలో ఏకలవ్య ప్రసంగం ఒకసారి వచ్చింది. కర్ణుడు ఇంద్రదత్తమైన శక్తితో ఘటోత్కచుని ఒక్కనాటి రాత్రి సమరంలో సంహరించాడు. కౌంతేయులంతా తల్లడిల్లి అత్యంత దీనమానసులయ్యారు. కాని శ్రీకృష్ణుడు మాత్రం సింహనాదం చేసి, పాంచజన్యాన్ని పూరించి నర్తించాడు. కృష్ణుని చేష్టచూసి అర్జునుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. కారణాన్నిలా చెప్పాడు – ఇంద్రాయుధాన్ని కర్ణుడు ప్రయోగించటం తనకు సంతోష కారణమని గోవిందుడు చెప్పాడు. అంతేగాకుండా "ఏకలవ్య శిశుపాల జరాసంధాదుల నీకకానొక్కొక్క తెఋంగునం బిలుకు మార్చితి"నని ఆనందంతో ఆ నందనందనుడు తెలిపాడు (ద్రోణ 5–239). మరి జరాసంధ శిశుపాల వధలు మనందరికి తెలిసనట్లుగా భారతంలోనే ఉన్నాయి. కాని ఏకలవ్యవధ భారతంలో ఎక్కడా లేదే? కురుక్షేత్ర యుద్ధానికి ముందే కృష్ణుడు ఏకలవ్యుణ్ణి చంపటమో, చంపించటమో చేసియుండాలి. కాని దీనికి సమాధానం భారతంలో మృగ్యం.

భారతంలో లేని విషయాలకు మనం హరివంశాన్ని పరికించాలి. భారతానికి హరివంశం ఖిలభాగం, పరిశిష్టం. భారతంలో లేని కథలు హరివంశంలో కొన్ని ఉన్నాయి. భారత కథలకు కొంత విస్తృతి హరివంశంలో ఉంటుంది. ఒక సన్నివేశానికి సంబంధించి గాని, ఒక పాత్రకు సంబంధించి గాని కథార్థం సంపూర్ణంగా తెలుసుకోవాలంటే అవశ్యం మనకు హరివంశం పఠనీయం. హరివంశంలోని ఏకలవ్య వృత్తాంతాన్ని పరికిద్దాం –

వసుదేవుడికి శ్రుతకీర్తి, శ్రుతదేవ, శ్రుతశ్రవ, పృథ, రాజాధిదేవి అనే 5 మంది చెల్లెండ్రు ఉన్నారు. శ్రుతకీర్తి కరుశాధీశుడైన వృద్ధశర్ముని పరిణయమాడింది. వారిద్దరికి దంతవక్త్రుడు జన్మించాడు. శ్రుతదేవకు కేకయేశ్వరునివల్ల ఏకలవ్యుడుదయించాడు. (కేకయేశ్వరుడు = కేకయ దేశానికి రాజు. ఆయన పేరు "హిరణ్యధన్వుడు.) ఈ ఏకలవ్యుడే నిషాదుల్లో పెరిగినవాడట. శ్రుతశ్రవ చేదిదేశాధీశుడైన దమఘోషుడనే వాణ్ణి పెండ్లాడి హిరణ్యకశిప్వంశ సంభూతుడైన శిశుపాలుని కన్నదట. భారతంలో ఈ శ్రుతశ్రవ పేరు సాత్వతి అని పేర్కొనబడింది (సభా 2.52, 56, 58), వసుదేవుడు తమ ఆత్మబంధువైన కుంతిభోజునికి కూతురుగా పృథనిచ్చాడట. కుంతిభోజుడు పెంచిన కారణంగా ఆ పృథ కుంతీదేవిగా ప్రసిద్ధి నొందింది. రాజాధిదేవి అనే వసుదేవుని చెల్లెలు అవంతీశ్వరుని వివాహమాడి విందానువిందుల్ని మిత్రవిందను కన్నది. ఈ మిత్రవింద కృష్ణుని అష్టమహిషుల్లో ఒకతె.

కృష్ణుడు తనకున్న ఐదుగురు మేనత్తల్లో కుంతీదేవి కొడుకులైన పంచ పాండవుల్ని మాత్రం రక్షించాడు. మిగిలిన నల్గురి మేనత్తల కొడుకుల్ని అంటే – దంతవక్త్రుడు, ఏకలవ్యుడు, శిశుపాలుడు, విందానువిందులు ఈ ఐదుగుర్ని తానే చంపటమో, తనవారిచేత చంపించటమో చేశాడు. శ్రుతకీర్తి కుమారుడైన దంతవక్త్రుణ్ణి రుక్మిణీహరణ సమయంలో చంపాడని భాగవత దశమస్కంధం చెప్తోంది. దంతవక్త్రుడు, ఏకలవ్యుడు, శిశుపాలుడు, విందాను విందులు జరాసంధునితో కలిసి కృష్ణుని మధురపైకి దండెత్తి వచ్చారు (ఉత్తర హరివంశం 1–84). పౌండ్రక వాసుదేవుడు ద్వారకా నగరంపైకి దండు వెళ్ళినపుడు ఏకలవ్యుడు కూడా ఉన్నాడు. (ఉత్తర హరివంశం 6–137). అప్పుడు ఏకలవ్య బలరాములు ఘోరయుద్ధం చేశారే గాని ఏకలవ్యుడు సంహరింపబడలేదు. హరివంశంలో కూడా ఏకలవ్యుని చావుని గురించిన ప్రస్తావన లేదు. కాని నాచన సోమన

ఉత్తర హరివంశంలో మాత్రం ఏకలవ్య బలరాములు మహా ఘోర సంగ్రామం చేసినట్లు, ఆ సమయంలో ఏకలవ్యుడు బలరామునికి ఓడి సముద్రంలో దూకి ఈదరి చేరక 5 యోజనాలు ఈది ఒక దీవిని చేరినట్లు ప్రస్తావింపబడింది (3-107). కాని ఏకలవ్య మరణం మాత్రం ఇందులోనూ లేదు. ("ఏకలవ్యుడు జరాసంధుని ఆంతరంగికులలో ఒకడు. జరాసంధుని సైన్యాలకు ఏకలవ్యుడే సేనాధిపతి. మధుర మీద పద్ధెనిమిదిసార్లు జరాసంధుడు దండెత్తాడు. ప్రతీ ముట్టడిలోనూ ఏకలవ్యుడు సైన్యాధిపత్యం వహించాడు." - ఆరుద్రగారి "ఏకలవ్యుని పుట్టుపూర్వోత్తరాలు" వ్యాసం, మహాభారత వైజయంతి, సప్తమ భాగము, పుటలు: 330-334)

ఇక శిశుపాలుని కృష్ణుడు రాజసూయయాగ అగ్రతాంబూల విషయంలో జరిగిన గొడవలో చక్రంతో సంహరించటం సుప్రసిద్ధమైందే గదా! (సభా 2-68). ఒకప్పుడు జరాసంధుడు విందానువిందుల్ని దూతలుగా శ్రీకృష్ణుని దగ్గరికి పంపించాడు (హరి. ఉత్తర 1-5). కృష్ణ పాండవులపై కోపంతో వీరిద్దరు కౌరవపక్షాన కురుక్షేత్రంలో పోరాడారు. సైంధవవధనాడు పార్థుడు ఏకస్యందనగతులైన విందానువిందుల్ని సంహరించాడు (ద్రోణ 3-143 నుండి 148). విందుని తల దొల్లగ నేశాడు. అనువిందుని చరణాలు, బాహువులు, శిరం ఖండించాడని భారతం పల్కుతోంది. ఈ విందానువిందులే కాకుండా భారతంలో మరొక జంట కైకేయులైన విందానువిందులున్నారు. వీరు కౌరవపక్షంలోనే పోరాడారు. అయితే వీరిని సాత్యకి సంహరించినట్లు భారతంలో కర్ణపర్వంలో ఉంది (1-89 నుండి 95). అనువిందుని తలద్రుంచి విందునితో ఖడ్గయుద్ధంచేసి సాత్యకి ఆతని శరీరాన్ని రెండు ముక్కలుగా నరికాడట.

శ్రీకృష్ణ సాహాయ్యంతో పాండవులు కురుక్షేత్ర సంగ్రామ సముద్రాన్ని ప్రాణాలతో ఈదారు. అంతే గాకుండా -

**క. తమ మేనయత్త గొంతికిఁ**
**బ్రమదంబున దత్తనూజపంచకమును గ**
**య్యముల బ్రతికింతు ననియె**
**న్గమలాక్షుఁడు పలికినట్లు కథ యేతెంచెన్**

(హరి. ఉ. 6-262)

అందువల్లే కృష్ణుడు పాండవ పక్షపాతిగా ప్రశస్తి పొందాడు. కృష్ణుడు తన మేనత్తల కొడుకులైన దంతవక్రుని, శిశుపాలుని తానే సంహరించారు. విందానువిందుల్ని, కర్ణుణ్ణి అర్జునునిచే చంపించాడు. మరొక మేనత్త కుమారుడైన ఏకలవ్యుని ఎక్కడ సంహరించింది తెలుగు భారత హరివంశ భాగవతాదుల్లో మృగ్యం. మరి ఎక్కడుందీ విషయం? పరిశోధనార్థమైన అంశంగానే మిగిలిపోయింది. ఏతావాతా చెప్పేదేమిటంటే ఏకలవ్యుడు స్వయానా శ్రీకృష్ణుని మేనత్త కొడుకే! పాండవులకు కూడా సోదరతుల్యుడే!

---

**ముఖ్య గమనిక (1) :-** ద్రోణుడు ఏకలవ్యుని కుడిచేతి బొటనవ్రేలిని గురుదక్షిణగా తీసికొనిన తరువాత, అతని గురుభక్తికి మెచ్చి, చూపుడు వ్రేలు మధ్యవ్రేలు మధ్య బాణాన్ని పట్టుకొని లక్ష్యాన్ని భేదించడం నేర్పించాడు.

**ముఖ్య గమనిక (2) :-** ఆరుద్రగారు పైన ఉదాహరించిన వ్యాసంలో ఇలా వ్రాశారు: "ఏకలవ్యుడు నిజంగా కృష్ణుని చేతిలోనే చనిపోయాడు. వ్యాసభారతం ఉద్యోగపర్వంలో సంజయ రాయబారానికి ముందు ఏకలవ్యుడు సజీవుడు. తమపక్క పోరాడవలసినదని ఆహ్వానించవలసిన రాజులలో ఏకలవ్యునీ, అతని కుమారునీ కూడా ద్రుపదుడు చేర్చాడు (ఉద్యోగ. అధ్యా.4, శ్లో.17). అయితే సంజయుని ద్వారా అర్జునుడు కురుసభకు పంపిన సందేశంలో కృష్ణుడు ఎవ్వరిని ఏ విధంగా వధించినదీ చెప్పాడు. ఆ హతులలో ఏకలవ్యుడు కూడా ఉన్నాడు (చూ.సంస్కృత భారతం):-

**అయం స్మ యుద్ధే మన్యతేఽన్వైరజేయం**
**తమేకలవ్యం నామ నిషాదరాజమ్**
**వేగేనైవ శైల మభిహత్య జంభః**
**శేతే స కృష్ణేన హతపరాసుః** (ఉద్యోగ. అ.48, శ్లో.77)
ఈ శ్లోకాన్ని తిక్కనగారు అనువదించలేదు"

ఈ శ్లోకానికి ఆచార్య శలాక రఘునాథశర్మగారు ఫోనులో చెప్పిన తాత్పర్యం: "ఈ శ్రీకృష్ణుడు ఇతరులెవరికిని జయింప నలవికాని నిషాదరాజగు ఏకలవ్యునితో యుద్ధము చేయగోరుచుండెను. అట్టి ఏకలవ్యుడు, పూర్వం జంభాసురుడు అతివేగముతో కొండను ఢీకొట్టి చచ్చినట్లు, కృష్ణునితో పోరాడి ప్రాణములు కోల్పోయి చచ్చిపడియుండెను"

**- తంగిరాల (9.2.2020)**

## అనుబంధం-1

# శ్రీకృష్ణదేవరాయలవారి వర్ణచిత్రం

**- ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

క్రీ.శ. 1509 నుండి 1530 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన గొప్ప చక్రవర్తియైన శ్రీకృష్ణ దేవరాయలవారు ఎలా ఉండేవారు? ఈ ప్రశ్నకు సమాధానాంగా (1) మాటలతో వర్ణించవచ్చును; (2) శిల్పంలో చెక్కవచ్చును; (3) వర్ణచిత్రంగా చిత్రించవచ్చును - ఇలాగ మూడు రకాలుగా రాయలవారు ఎలా ఉండేవారో తెలుసుకోవచ్చును. మాటలతో వర్ణిస్తే మన మనోనేత్రంతో చూడగలం. మిగిలిన రెండింటినీ మన చర్మచక్షువులతో చూడవచ్చును.

**(1) పదచిత్రం:-**

రాయలకాలంలో రాయలవారిని ప్రత్యక్షంగా దర్శించిన "డామింగో పేయసు"(Domingo Paes)అనే పోర్చుగీసు యాత్రికుడు ఈ క్రింది విధంగా వర్ణించాడు:-

"ఈ రాజు శ్రీకృష్ణదేవరాయలు మిక్కిలి పొట్టియును గాక, పొడవును గాక, సామాన్యపు ఎత్తు గలిగి, సొగసుగుల్కు ముఖవర్చస్సును స్థూలకాయమును గలిగి, సుందరాకారముతో నొప్పుచుండెను. వాని ముఖము మీద స్ఫోటకపు మచ్చలు గలవు. అతఁడు భయము గలిగించు నట్టియు, పూర్ణప్రజ్ఞ గలిగినట్టియు, సంతోష స్వాంతుఁడుగా నున్నట్టియు మిక్కిలి యుల్లాసము గలట్టియు రాజుగా నుండెను. విదేశీయులను సన్మానించుటకును, వారలను దయతో నాదరించుటకును, వారి స్థితిగతు లెట్టివైనను వారివ్యాపారములనుగుఱించి తెలిసికొనుటకును అపేక్షించు వాడుగా నున్నాఁడు. అతఁడు న్యాయబుద్ధిగల గొప్ప ప్రభువుగా నున్నాఁడు గాని యొక్కొక్కప్పుడు ఆకస్మికముగా దురహంకారమును బొందుచుండును. ఇతనికి 'శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర, శ్రీకృష్ణదేవరాయలు' అని బిరుదములనేకములు గలవు. సేనలోగాని, రాజ్యములో గాని, యాతనికన్న నధికముగాఁగలవాఁడు మఱియొకఁడు లేనందునను, సమస్త విషయముల యందును పరిపూర్ణ సామర్థ్యము గలవాఁడయి యుండుటవలనను, అట్టి బిరుదములను వహించియుండెను.

"ఈ రాజు సూర్యోదయమునకు ముందుగా ప్రతిదినము కొంచెమించుమించుగా సోలెడు నువ్వులనూనెను త్రాగుట కలవాటు పడినవాఁడు. ఆ నువ్వులనూనెతోనే దేహమంతయు నలముకొనును. తరువాత నడుమునకొక చిన్నగుడ్డ కట్టుకొని, మంటితోఁ జేయబడిన బరువులను భుజముమీఁద నుంచుకొనును. అటుపిమ్మట కత్తి తీసికొని చమురంతయు దేహమున నింకుపర్యంతము సాము చేయుచుండును. తరువాత తన వస్తాదులతో నొకనితోఁ గుస్తీ పట్టును. ఈ పని జరిగించిన తరువాత నశ్వారూఢుండై తెల్లవాఱువఱకు విశాలమగు బయలులో నొకప్రక్కనుండి మఱియొక ప్రక్కకు సవారు చేయుచుండును. సూర్యోదయమునకుఁ బూర్వముననే యింతపనియుఁ బూర్తి చేసికొనును. తరువాత స్నానము చేయుటకుఁ బోవును.

"అప్పుడు మిక్కిలి భాగ్యవంతుఁడును, తనకిష్టుఁడును, అతనివలనఁ బవిత్రుడుగాఁ జూడఁబడువాడును అగునొక బ్రాహ్మణుని వలన స్నానము చేయింపఁబడును. స్నానము చేసిన తర్వాత అంతఃపురము లోపలనున్న దేవాలయమునకుఁ బోయి, కులాచారము ననుసరించి

ప్రార్థనాది కర్మములను గావించుకొనును. పిమ్మట... రాజకీయ వ్యవహారములం బరిష్కరింపుచు, నగరములను బరిపాలించుచు, తనకిష్టులగువారితో ముచ్చటించు చుండును. అతనికిష్టులగువారిలో ముఖ్యుడు తిమ్మరసు (మంత్రియగు సాళువ తిమ్మరాజు) నానొక్క వృద్ధ బ్రాహ్మణుఁడు గలఁడు.

.............

"రాజు సువర్ణమయములగు గులాబీ పుష్పములతోఁ జిత్రింపఁబడిన శ్వేతాంబరములను ధరించియుండెను. అమూల్యమయినట్టి వజ్రాలపతకమును మెడలో నలంకరించుకొనియుండెను. సొగసయిన పట్టుతో మూయఁబడియున్న గెలీసియాదేశపు శిరస్త్రాణమువంటి సరిగబుట్టా వేసిన పట్టుకుళ్ళాయి శిరస్సున ధరించి యుండెను. ఎవ్వఁడును పాదరక్షలు తొడుగుకొని యాతని సన్నిధానమునకు రారాదు. దేశములోఁ బెక్కండ్రు పాదరక్షలు లేకయే తిరుగుచుందురు."

(–చిలుకూరి వీరభద్రరావుగారి శ్రీకృష్ణరాయచరిత్ర, 1903)

**(2) శిల్పం:–**

శ్రీకృష్ణదేవరాయలు తిరుమలలోని శ్రీ వేంకటేశ్వర స్వామివారికి అత్యంత భక్తుడు. తాను రచించిన ఆముక్తమాల్యదా ప్రబంధాన్ని స్వామివారికే అంకిత మిచ్చాడు. రాయలు తన పాలనాకాలంలో ఏడుసార్లు స్వామివారిని దర్శించి కానుకలు సమర్పించినట్లుగా శాసనాలు, చరిత్ర చెపుతున్నాయి. ఆ యాత్రలలో రాయల వారే స్వయంగా తిరులమదేవాలయంలో ప్రతిష్ఠించుకున్న పంచలోహ విగ్రహాలున్నాయి. తిరుమలదేవి, చిన్నాదేవి అను ఇరువురు రాణులతో కూడిన రాయల విగ్రహం, మనం సింహద్వారంనుండి లోనికి ప్రవేశించగానే మన కుడివైపున ఉంది. (దీనినే ఈ సంచికలో ముఖచిత్రంగా వేశాను.) చిదంబర దేవాలయం ఉత్తర గోపురం మీద కూడా రాయలు తన శిలా విగ్రహాన్ని చెక్కించుకున్నారు. (చూ. వేదం వేంకటరాయశాస్త్రిగారి ఆముక్తమాల్యద వ్యాఖ్య, ద్వితీయ ముద్రణ, 1964, ఉపోద్ఘాతము, పుటలు 20–21 మధ్య). చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి కోటలోను, కర్నూలు జిల్లాలోని లక్ష్మీపురంలోను, ఇద్దరు దేవేరులతో కూడిన రాయల శిలావిగ్రహాలు ఉన్నాయి. (చూ. పెండకూరు గురుమూర్తిగారు రచించిన "శ్రీకృష్ణదేవరాయన కాలద కన్నడ శాసనగళు", పుటలు 351, 352).

**(3) వర్ణచిత్రం:–**

రాయలవారి వర్ణచిత్రం ఒకటి లోకంలో ప్రచారంలో ఉంది. అది ఎలా వ్యాపించిందో తెలియదు; ఎంతవరకూ నిజమో తెలియదు. హంపీ విజయనగరం దగ్గరనున్న "ఆనె గొంది"లో రాయల వంశస్థులున్నారు. వారి దగ్గర రాయల వర్ణచిత్రం ఒకటి ఉందని చెపుతారు. నేను చూడలేదు. 2010 ఏప్రిల్ 22వ తేదీ గురువారం నాటి "సాక్షి" దినపత్రికలో "వీరే రాయలవారు" అనే వార్త, దానితోపాటు ఒక వర్ణచిత్రం ముద్రింపబడ్డాయి. ఈ వర్ణచిత్రాన్ని రాయల కాలంలో "డామింగో పేస్" అనే పోర్చుగీసు చిత్రకారుడు విజయనగరం వెళ్ళి రాయలవారిని దర్శించి, రోజూ కొంత కొంత చొప్పున చిత్రించాడని ఈ వార్త చెప్పింది. ఆ వర్ణచిత్రం ఇప్పుడు పుణెలోని "భారత ఇతిహాస సంశోధన మండలి"లో భద్రంగా ఉందని కూడా చెప్పింది. ఆ వార్త, ఈ దిగువ ఇస్తున్నాను. (ఆ వర్ణచిత్రంకూడా ఈ సావనీర్‌లో ముద్రించాను.)

**వీరే... రాయలవారు!**

శ్రీకృష్ణదేవరాయలు... అనగానే కవులు, పండితులు, గోష్ఠులు, కళాపోషణలు... అవే మదిలో మెదులుతాయి. ఆయన కళాపోషకుడే కాదు; యుద్ధతంత్రంలోనూ అందె వేసిన చేయి. ఏ యుద్ధంలోనూ ఓటమి ఎదురగని ధీరుడు. విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన 30 మంది

పాలకుల్లో శ్రీకృష్ణదేవరాయలకీర్తి సువర్ణాక్షరాలతో లిఖించదగింది. క్రీస్తుశకం 1509 నుంచి 1529 వరకూ పాలించిన శ్రీకృష్ణదేవరాయలు అనారోగ్యంతో తన 49వ ఏట కన్నుమూశారు. అంగళ్ళలో రత్నరాశులు కుప్పగా పోసి విక్రయించేవారంటూ ఆయన పాలనాకాలాన్ని కీర్తించనివారుండరు. రాయలవారి పాలనను కవులు వర్ణించడం వింటుంటే మళ్లీ ఆ పాలన వస్తే ఎంత బాగుండునో అనుకోవడం కద్దు. మరి అంతటి గొప్ప పాలకుడైన శ్రీకృష్ణదేవరాయలు ఎలా ఉంటారనగానే, సినిమాల్లో ఆయన పాత్రపోషణ చేసిన ఎన్టీఆర్‌ను ఊహించుకోవడం సహజం. కానీ వాస్తవంగా ఆయన రూపు వేరుగా ఉంటుంది. ఆయన చిత్రపటాన్ని వీక్షిస్తే ఈ విషయం అర్థమవుతుంది. ఇంతకీ చిత్రపటం పుణెలోని భారత ఇతిహాస సంశోధన మండలిలో ఇప్పటికీ భద్రంగా ఉంది. దీనిని డామింగో పేస్ అనే పోర్చుగీసు చిత్రకారుడు వేశాడు. హంపీలోని విజయనగర సామ్రాజ్యానికి వచ్చినప్పుడు 1520లో ఈ చిత్రాన్ని వేశాడట. ఇందుకోసం 15 వారాల సమయం తీసుకున్నాడట. శ్రీకృష్ణదేవరాయలపై అధ్యయనం చేస్తున్న సినీనిర్మాత, దర్శకుడు డాక్టర్ కృష్ణారావు కేశవ్ భారత ఇతిహాస సంశోధన మండలిలో ఉన్న ఈ చిత్రపటాన్ని ఫోటో తీసి జాగ్రత చేశారు. విజయనగర సామ్రాజ్యానికి 24వ రాజుగా పట్టాభిషేకం జరిగి 500 ఏళ్ళు పూర్తయిన సందర్భాన్ని పురస్కరించుకుని రాష్ట్ర ప్రభుత్వం ఉత్సవాలు నిర్వహించబోయే తరుణంలో ఈ చిత్రపటం వెలుగులోకి రావడం విశేషం. కేశవ్ 'న్యూస్‌లైన్'తో మాట్లాడుతూ రాయలకు సంబంధించిన పలు అంశాలను ప్రస్తావించారు. "ముఖంపై స్ఫోటకపు మచ్చలు, కురచగాఉండే శ్రీకృష్ణదేవరాయల మనసుమాత్రం వెన్నలా ఉండేదని చరిత్రకారుల వర్ణనలనుబట్టి తెలుస్తోంది. పెయింటింగ్‌ను చూస్తే శ్రీకృష్ణదేవరాయలు స్ఫురద్రూపి కాదనిపిస్తుంది. రాయలపాలనగురించి ఘనంగా చెప్పుకునే మనమంతా ఆయన ఎలా ఉంటారో ఒక విదేశీయుడి కుంచె పుణ్యమాని చూస్తున్నాం. రోజూ కొద్దిసేపు ఆ విదేశీ చిత్రకారుడి ముందు రాయలవారు నిలబడితే కొంచెం కొంచెంగా ఆ పెయింటింగ్ పూర్తి చేశారు..." అని వివరించారు.

**ఓటమి ఎరుగని యోధుడు:-**

శ్రీకృష్ణదేవరాయలు ఆజానుబాహుడు కాదు. మరీ అందమైనవాడూ కాదు. కానీ యుద్ధంలో ఆయనకు ఆయనే సాటి. కవుల పోషణ, గోష్ఠులు జరుగుతున్నా రాజ్యరక్షణ కోసం అప్రమత్తంగా ఉండేవాడు. బాగా క్రమశిక్షణతో ఉండేవాడు. ప్రపంచ చరిత్రలోనే ఓటమి ఎరుగని వ్యక్తిగా నిలిచిపోయినవాడు.

**- పురావస్తుశాఖ సంచాలకుడు: పి. చెన్నారెడ్డి**

(**గమనిక:-** "డామింగో పేస్" నాకు తెలిసి పోర్చుగీసు యాత్రికుడు. ఈ వార్త అతనిని చిత్రకారుడుగా చెపుతోంది. ఎంతవరకు సత్యమో తెలియదు **- తంగిరాల**)

## ఆరుద్రగారి ఛలోక్తి-2

ఆరుద్రగారు కొత్తగా గడ్డం పెంచారు. దానిని చక్కగా ట్రిమ్ చేసుకున్నారు. చూడటానికి చాలా బాగుంది. డా॥ పప్పు వేణుగోపాలరావు అనే మిత్రుడు ఆరుద్రగారిని చూసి. "అయ్యా! మీ గడ్డం చాలా అందంగా ఉంది. అచ్చంగా షాజహాను గడ్డంలా ఉంది!" అన్నారు. వెంటనే ఆరుద్రగారు. "ఈ మాట నాతో అంటే అన్నారు కాని మా ఆవిడతో మాత్రం అనకండి! నన్ను తాజ్‌మహల్ కట్టించమంటుంది!" అన్నారు. అక్కడున్న మిత్రులంతా పగలబడి నవ్వారు. **(-తంగిరాల)**

అనుబంధం-2

# అనన్య 'శ్రీరస' - ఆత్మీయత

- డా॥ దివాకర్ల రాజేశ్వరి
('శ్రీరస' వ్యవస్థాపక కార్యదర్శి)

బెంగుళూరులో స్థానికమైన పలు తెలుగుసంఘ సంస్థలున్నాయి. వాటిలో ప్రఖ్యాతమైనవి, ఘనమైన వేదికలో జాతీయస్థాయి కార్యక్రమాలను నిర్వహించే సంస్థలున్నాయి. సాంస్కృతిక పరమైన, విజ్ఞాన, వినోద ప్రాధాన్యమైన సంస్థలున్నాయి. వాటన్నింటిలో "శ్రీరస"గా పేరొందిన "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" ప్రత్యేకమైనది. ఈ సమాఖ్య కేవలం సాహిత్య ప్రధానమైనది. వేదాలనుండి స్త్రీవాదంవరకూగల సకల సాహిత్య ప్రక్రియలకూ సభావేదికలపై సమున్నతమైన స్థానమిచ్చిన సమాఖ్య "శ్రీరస".

"శ్రీరస" వ్యవస్థాపక అధ్యక్షులు ప్రొ॥ తంగిరాల వెంకటసుబ్బారావుగారు ఆచార్యులుగా, పరిశోధకులుగా, ఉత్తమ ఉపన్యాసకులుగా, శిష్యకోటికి ఆదరణీయమైన గురువుగా విశ్వవిద్యాలయ స్థాయి ఉన్నత విద్యావేత్తలతో అనుబంధం కలిగినవారుగా ప్రసిద్ధులు. వీరు బెంగుళూరు లోని తెలుగు సంస్థలన్నింటికీ సాహిత్య పరమైన పెద్ద దిక్కుగా, సలహా మండలి సదస్యులుగా, గౌరవ ప్రపత్తుల నందుకున్నవారు. స్నేహశీలిగా చెలిమి కలిమిని అపారంగా విస్తరించుకున్నవారు.

విద్యా, సాహిత్య రంగాలలో ప్రముఖులయిన ఆచార్యుల నాయకత్వంలో శ్రీరస నాణ్యత "రజతకాంతుల"తో విస్తరించింది.

శ్రీరస సమాఖ్య భావనామ సంవత్సరం ఉగాది రోజు (11.04.1994 నాడు) ఆరంభం అయింది. ఆరంభం నుంచి ఈనాటి వరకూ శ్రీరసతో నా అనుబంధం అవిచ్ఛిన్నంగా కొన సాగుతోంది. అవాంతరంగా సభా సాన్నిహిత్యానికి ఆటంకం కలిగినా గురువుగారి అభిమానం వలన ఆత్మీయత కొనసాగుతోంది. ఈనాటికీ శ్రీరస వేదిక ఆహ్వాన పత్రికలలో కార్యనిర్వాహకవర్గంలో నా పేరు నుంచడం ఆచార్యుల హృదయ వైశాల్యానికొక నిదర్శనం.

శ్రీరస ఆరంభసభ మా ఇంట్లో జరిగింది. ఆ సభకు ఆత్యాధునికకవి, ఉద్యమశీలి, సామాజిక కార్యకర్త శ్రీ "పరాభి"గారు. సుప్రసిద్ధ కన్నడ దళితకవి శ్రీ సిద్ధలింగయ్యగారు, సి.నా.రె.గారి కావ్య సంపుటుల నన్నింటినీ కన్నడానికి అనువదించినవారు, కవి శ్రీ మార్కండపురం శ్రీనివాసగారు, ఆచార్య జి.ఎస్. మోహన్‌గారు, ఆనాటి తెలుగు ఎం.ఎ. విద్యార్థులు, తెలుగు సాహిత్య ప్రేమికులనేకులు విచ్చేసారు. ఆనాటి ప్రారంభకుల ఆశీర్వాదమే ఈనాటివరకూ కొనసాగుతున్న సభాపరంపరల శ్రీరస ఉత్సవానికి మూలకందమై నిలిచిందని చెప్పవచ్చు.

ఆరంభంలో శ్రీరస "నెల నెలా వెన్నెల" సమావేశాలు కార్యదర్శులైన రాజేశ్వరి, అంబిక, తదితర సదస్యుల ఇంట సానుకూలంగా జరిగేవి. అనాటి సమాఖ్య కూడికలకు కవి డా॥ జె.బాపురెడ్డిగారు, ప్రొ॥ బేతవోలు రామబ్రహ్మం గారు, డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారు, "చెట్టుకవి" ఇస్మాయిల్‌గారు, ప్రొ॥ శలాక రఘునాథ శర్మగారు, ప్రొ॥ ఆర్వీయస్. సుందరంగారు వంటి ప్రముఖులనేకులు విచ్చేసి తమ ప్రసంగాలను కావించారు. తదనంతరం సదస్యుల సంఖ్యనుబట్టి, వారి రాకపోకల సౌకర్యమునుబట్టి నియమిత వేదికాస్థలము అవసరం అయింది. అందుకుగాను బెంగుళూరు విశ్వవిద్యాలయం - సెంట్రల్ కాలేజిలోని సెనేట్‌హాలు, గాంధీ సాహిత్య సంఘం (8వ క్రాసు,

మల్లేశ్వరం, బెంగుళూరు) ఉపన్యాస వేదికగా మారింది. తదనంతరం ఆచార్యులు, భారతీయ విజ్ఞాన సంస్థ (IISc.) ప్రాంగణంలో అక్కడ ఉన్న తెలుగు సాంస్కృతిక సంఘం సంయుక్త ఆధ్వర్యంలో పలుసభలు నిర్వహించారు. ప్రస్తుతం శ్రీరస సాహిత్య సమావేశాలు సంజయనగర్‌లోని శ్రీ వరసిద్ధి వినాయకస్వామివారి ఆలయ ప్రాంగణంలో "శ్రీరామ శంకర మందిరం"లో వరిష్ఠులయిన సంస్కృతి ప్రియుల తోడ్పాటుతో అగ్రగణ్యు లయిన ఉపన్యాసకుల వక్తృత్వ విన్యాసంతో కొనసాగుతున్నాయి.

శ్రీరస సమాఖ్యకు ప్రాణభూతమైన శక్తి ఆచార్య తంగిరాలవారు. వారు కవిత్వాన్ని ప్రేమించారు. కవిత్వానికి అంకితమైన పత్రిక "చైతన్య కవిత"ను ప్రముఖ కవుల ముఖచిత్రాలతో దాదాపు 48 షాణ్మాసిక సంచికలను ఆయాకవుల కవిత్వతత్త్వ విచారాలతో, వారినిగురించి వివిధ కవుల కవిత్వచిత్రణలతో, పద్య, వచన కవిత్వాలతో, వివిధ కవిత్వ సంపుటుల గీటురాళ్ళతో వెలువరించారు. చైతన్యకవితా సంచికల సంపాదకవర్గంలో కూడా నా పేరును చేర్చి ఆదరించారు. ఆచార్యులవారు, పఠాభిగారి ఆధునికతను ఉద్యమ శీలత్వాన్ని ఆరాధించారు. పఠాభిగారి కుమార్తె నందనగారిచ్చిన విందులో పాల్గొని, కవిగారిని గూర్చిన సాక్ష్యచిత్రాన్ని చూసే అవకాశం కలిగించారు. వారు తలచిన కార్యాన్ని సాధించేందుకు, శక్తి సామర్థ్యాలన్నింటినీ వెచ్చించిన సంకల్పసిద్ధులన్న విషయం దర్శించగలిగాము. అలాగే మహాకవి శేషేంద్రశర్మగారు వేసవి విశ్రాంతికి బెంగుళూరు మీదుగా ఊటీకి వెళ్ళే సందర్భంలో వారితో సందర్శనావకాశాన్ని కలిగించారు. కార్యదర్శులమైన, నేను, అంబిక రచించిన కవిత్వ సంపుటులను శ్రీ శేషేంద్రగారు, వారి సతీమణితో కలసి ఆవిష్కరించగలిగిన విశేష సందర్భాన్ని సమకూర్చారు. తదుపరి శేషేంద్రగారి సతీమణి శ్రీమతి ఇందిరాదేవి ధనరాజగిరిగారు ఆ సమావేశపు ఛాయాచిత్రాలను పంపించి, వారి చెలిమిని చూపడమే కాకుండా, అదొక మరపురాని ఘట్టంగా తీర్చారు.

శ్రీరస సభలలో నావంతుగా ముందు ఆహ్వానాన్ని పలకడం, తదుపరి వందన సమర్పణలను కావించేదానిని. ఆచార్యులు విద్వత్పరంగా గౌరవించదగిన సాహితీ దిగ్గజము లనేకమందిని శ్రీరస వేదికలకు వక్తలుగా ఆహ్వానించారు. వారిలో త్రిభాషా సహస్రావధాని శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు, 1) మహాసహస్రావధాని డా॥ గరికపాటి నరసింహారావు గారు, 2) ప్రముఖ రంగస్థల నటులు శ్రీ మీగడ రామలింగస్వామిగారు, తదితర మహావక్తల ప్రసంగాలు వరుసగా రెండు మూడు రోజులపాటు వినగలిగిన అవకాశం కలిగింది.

ఆచార్య తంగిరాలవారి సభాపర్వ నిర్వహణోత్సాహం మితిలేనిదనవచ్చు. అరసం బెంగళూరుశాఖతో శ్రీరస నెరపిన సఖ్యం అసమానమైనది. అరసం బెంగళూరుశాఖ అధ్యక్షులు శ్రీనిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు శ్రీరస సదస్యులకు ఎంతో ఆత్మీయులు. శ్రీనిడమర్తివారి అశీతిపూర్తి పండుగను ఆచార్య తంగిరాలవారు పూనుకొని ఆచరించడం, ఆ దంపతులను పూర్ణకుంభంతో, వేదవచనాలతో ఆహ్వానించి సత్కరించడం (2003) దివ్యమైన అనుభవం. అలాగే రంగస్థల నటులు, పద్యగాన ప్రవీణులు, ఆచార్యులవారికి అరమరికలేని మిత్రులు అయిన శ్రీ దర్శి లక్ష్మీవేంకటేశ్వర వరప్రసాదరావుగారి షష్టిపూర్తిని మహోత్సవ పర్వంగా ఆచరించడం వారికే సాధ్యమయిందని చెప్పవచ్చు. ఆయా సందర్భాలననుసరించి స్థానికకవుల కవి సమ్మేళనం తప్పని సరి. వాటిలో స్వీయకవితను నేను పఠించడం మరపురాని అనుభూతి. ఆచార్యులవారు, కుర్తాళం పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామివారి కోరిక ననుసరించి, స్థానిక బహుభాషాకవుల కవితాసమావేశాలను ఏర్పాటు కావించారు. వారి సమక్షంలో కవితను చదివే అవకాశం కలగడం, శ్రీరస సాహచర్యం వలన, కుర్తాళంవారి "మౌన

ప్రభ' సంచిక నెలనెలా ఉచితంగా లభించడం, చెప్పుకుని, మురిసిపోయే సంగతులనిపిస్తాయి.

తంగిరాలవారికి సాహిత్య శాఖలన్నీ ఆత్మీయమైనవే. వారు బెంగుళూరు విశ్వవిద్యాలయ ప్రసారాంగ, దక్షిణ వలయం కేంద్రసాహిత్య అకాడమీ కార్యాలయంవారితో, పి.ఇ.ఎస్. కళాశాల, తెలుగు విభాగం మొదలయిన ఇతర సంస్థలతో సంయుక్తంగా పలుకార్యక్రమాలను నిర్వహించారు. బుచ్చిబాబుగారి సతీమణి శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారి కోరికపై ప్రతిసంవత్సరం జూన్ 14వ తేదీబుచ్చిబాబుగారి జన్మదినంనాడు స్మారక ఉపన్యాసాలను ఏర్పాటు కావించారు. స్థానిక రచయిత్రుల కవన సంపుటుల, కథాసంపుటుల, ఆవిష్కరణల సభలను సంయోజితం కావించారు. వారిసభానిర్వహణాప్రణాళిక క్రమబద్ధమైనది. వారు ఆహ్వానితులైన వక్తలను శాలువా సత్కారాలతో విరులదండలతో సముచితంగా సత్కరిస్తారు. దాతలను, సభాసౌజన్యం చేకూర్చినవారిని నియమబద్ధంగా పేర్కొంటారు. శ్రీరస సదస్యుల పట్టికను, వారి దూరవాణి సంఖ్యలను అందరికీ అందుబాటులో ఉంచుతారు. కార్యక్రమం ముగిసిన పిమ్మట ఆ సభ ఛాయాచిత్రాలను తపాలాలో పంపించి, శ్రద్ధను వహిస్తారు. తాము చదివిన పుస్తకాలను ఇతరులకు సూచించి, భారమని అనుకోకుండా సంచిలో పుస్తకాలను మోసుకొని తెచ్చి, సాహిత్య జిజ్ఞాసువులకు అందజేయడం సాహిత్యాచార్యులుగా తమ బాధ్యత అని భావిస్తారు.

శ్రీరస హార్దిక, ఆర్థిక ప్రణాళికలను విసువు లేక, క్రమబద్ధంగా నిర్వహించడం కూడా వారికి చెల్లుననిపించే సంగతి. నగర ప్రముఖులు, దానచింతామణి డి.కె. ఆదికేశవులుగారు ఆచార్యులవారిపట్ల చూపిన స్నేహభావం అపురూపమైనది. వారి కోరికననుసరించి "హిమవద్గోపాల స్వామి చరిత్ర"ను ప్రకటించారు. ప్రతిభా జ్యుయల్రీహౌస్ అధినేత "దానరాధేయ" శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు, శ్రీరసకు వెన్నుదన్నుగా నిలచారంటే, దానికి ఆచార్యులవారి అకలంక స్వభావమే కారణమని చెప్పాలి.

ఇక చివరి మాటగా చెప్పాలంటే ఆచార్య తంగిరాల సుబ్బారావుగారు శ్రీరస సదస్యులను తమ సొంత కుటుంబమువలె సొంతం కావించుకున్నారు. ప్రతిఒక్కరిని ఏమరుపాటులేక గౌరవించి, ఆత్మీయంగా పలుకరించి, వాత్సల్యమును ప్రకటిస్తారు. తమ జ్యేష్ఠసోదరులు శ్రీ తంగిరాల సోమయాజులుగారి పాండిత్య ప్రతిభా విశేషాల నెంతో గర్వంగా చెప్పుకొనడమే కాకుండా, వారు వ్రాసిన పుస్తకాలను ముద్రించారు. తమ ఆత్మీయ సోదరులపై అపారమైన ప్రేముడిని ప్రకటిస్తారు. తమ ధర్మపత్ని శ్రీమతి శకుంతలాదేవిగారి సంస్మరణగా ప్రతి సంవత్సరం సాహిత్యవేత్తలయిన స్త్రీల ఉపన్యాసమును ఏర్పాటు చేసి సన్మానిస్తారు. వారికి స్త్రీవిద్యపై అపారమైన అభిమానం. వారి కుమార్తె శశిప్రియ ఆంగ్లభాషా పదవులనందుకున్నందుకు, వారి మనుమరాండ్రు పెద్ద పదవులలో దేశవిదేశాలలో ఉన్నందుకు, తమ సోదరుని కుమార్తె ఆర్మీలో బ్రిగేడియర్ పదవిలో ఉన్నందుకు గర్వపడు తుంటారు. నా విద్యాప్రగతిలో వారి మార్గదర్శకత్వంలో సిద్ధాంత వ్యాసాన్ని వ్రాసి పదవిని పొందే అవకాశం కలిగింది.

ఈనాటికీ మొక్కవోని కార్యక్రమ సభానిర్వహణల ఉత్సాహం వారిది. స్వీయదుఃఖాలను మరపించిన వెన్నెల పువ్వుల "గుండెపూసిన గులాబీ" శ్రీరస సదా పరిమళించాలి. చిరాయువుతో, ఆరోగ్య సంపదతో, నిత్య శ్రేయస్సుతో ఆచార్య తంగిరాలవారు సదా చైతన్యమూర్తిగా నిరవధిక సాహిత్య భువనవిజయాలతో వాఙ్మయప్రభుతను నెరపాలని మనసారా కోరుకుంటున్నాను.



# అరవై వసంతాల కవితావాణి
# "అనంతు"ని పట్టపురాణి

**– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

నాకు కుటుంబంలో ఇద్దరు కూతుళ్ళు: "సీత"–"శశి"; సాహిత్య కుటుంబంలో మరో యిద్దరు కూతుళ్ళు: "రాజేశ్వరి" (డా॥ దివాకర్ల రాజేశ్వరి) – "అంబిక" (శ్రీమతి అంబికా అనంత్). వీరి సహాయ సహకారాలతో నేను "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" (శ్రీరస) అనే సాహిత్య సంస్థను పాతికేళ్ళక్రితం స్థాపించి, ఈనాటివరకూ దిగ్విజయంగా నిర్వహిస్తున్నాను. వీరి చేదోడు వాదోడుతోనే "చైతన్య కవిత" అనే కవిత్వ పత్రికకూడా 24 సంవత్సరాలు(1986–2009)–48 సంచికలుగా వెలువరించాను.

అంబికా – రాజేశ్వరులు (రెండూ అమ్మవారి పేర్లే! ఇద్దరూ సౌందర్యలహరీ దేవతలే!) ఎన్నో ఏండ్లుగా రసవంతమైన కవిత్వాన్ని వ్రాస్తున్నారు. ఒకసారి వీరు రచించిన కవితా సంపుటాలకు నేను పీఠిక వ్రాస్తూ దానికి "బెంగుళూరులో రెండు పూలచెట్లు" అనే శీర్షిక ఉంచాను. కవి మిత్రులు డా॥ జె.బాపురెడ్డిగారు దానిని చూచి సంతోషించి, "రెండు పూలచెట్లేమిటి? రెండు పూలతోటలు అనాలి"–అని ప్రశంసించారు – ఈ కవియిత్రులిద్దరినీ.

25 సంవత్సరాల క్రిందట ప్రముఖ కవి డా॥ జె. బాపురెడ్డిగారు శ్రీమతి అంబికా అనంత్‌గారిని నాకు పరిచయం చేశారు. అప్పటినుండి ఇప్పటివరకూ ఆమె నా యెడల ఎంతో అభిమానాన్ని చూపుతున్నారు. నన్ను గురువుగా భావిస్తారు. అంతేకాదు, నన్ను పితృసమానునిగా ఎల్లప్పుడూ గౌరవిస్తారు. మా ''శ్రీరస'' సభలకు అంబికా–అనంత్ దంపతులు ఎన్నోసార్లు ఆర్థిక సహాయాన్ని కూడా అందించారు.

శ్రీమతి అంబికా అనంత్‌గారు గొప్ప కుటుంబంలో పుట్టారు; మరో గొప్ప కుటుంబంలో మెట్టారు. అంబికగారి తండ్రి కీ.శే. వణుకూరి నారాయణరావుగారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో పనిచేసిన సీనియర్ ఐ.ఏ.ఎస్. అధికారి. ఆయన కేవలం ప్రభుత్వోద్యోగి మాత్రమే కాదు; ఆంగ్లంలో మంచికవి, రచయిత, గొప్ప సాహిత్య రసజ్ఞరాజశేఖరుడు. శేషేంద్ర, సినారె, బాపురెడ్డి వంటి మంచి కవిపుంగవులకు ఆప్తమిత్రులు. అటువంటి సాహిత్య సంస్కారం కలిగిన నారాయణరావుగారి పెద్దకూతురు–శ్రీలలితాంబికగారు. ఈమె అన్నివిధాలా తండ్రికి తగ్గ తనయ. తండ్రిగారి సాహిత్య సంస్కారాన్ని పుణికి పుచ్చుకున్నారు. ఆంగ్ల సాహిత్యంలో పట్టభద్రురాలు. చిన్నతనంనుండీ తెలుగులోను, ఆంగ్లంలోను కవిత్వం వ్రాస్తున్నారు.

చిన్నప్పటినుండీ చేసిన కృషి ఫలితంగా శ్రీమతి అంబికా అనంత్‌గారు ఈనాడు ప్రసిద్ధ ఆంధ్రాంగ్ల కవయిత్రిగా, రచయిత్రిగా, అనువాదకురాలుగా, పాత్రికేయురాలుగా కీర్తిప్రతిష్ఠలు గడించారు. మూడు కవితా సంపుటాలు (తెలుగులో రెండు, ఆంగ్లంలో ఒకటి), నాలుగు అనువాదగ్రంథాలు వెలువరించారు. డా॥ అద్వితీయ దీక్షిత్‌తో కలిసి తాళ్ళపాక అన్నమాచార్యులవారి జీవిత చరిత్రను, 200 సంకీర్తనలను, ఆంగ్లంలోకి అనువదించడం; డా॥ దివాకర్ల రాజేశ్వరిగారితో కలిసి బసవేశ్వరుని 1400 వచనాలను "బసవన్న సమగ్ర వచనాలు" అనే పేరుతో కన్నడం నుండి తెలుగులోకి అనువదించడం – అంబికా అనంత్‌గారి విశిష్ట సాహిత్య సేవకు తార్కాణాలు. "Divine Mantras - Eternal Bliss", "Akshara Ganapathi -

Kundalinipathi" – ఇవి ఈమె ఆంగ్లంలోకి చేసిన అనువాదాలు. ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీ నేదునూరి కృష్ణమూర్తిగారి పాటలను ఆయన కోరికపై ఆంగ్లంలోకి అనువదించి ఇచ్చారు. అంబికగారు కవిత్వమే కాదు కథలు కూడా వ్రాస్తారు. తాను రచించిన 14 కథలను కలిపి "మంచు ముత్యాలు" అనే పేరుతో 2005లో ఒక సంపుటిగా తెచ్చారు. (ఈ గ్రంథాన్ని నాకు అంకితం చేశారు.) "The Hindu" వంటి ప్రముఖ ఆంగ్ల దినపత్రికలలో సాహిత్య సంగీత నృత్య విషయాలపై మంచి సమీక్షలు వ్రాస్తూ వుంటారు. ఎన్నో ఏండ్లుగా "MUSE INDIA" అనే సాహిత్య పత్రికను అంతర్జాలంలో నడుపుతున్నారు.

భగవంతుడు చేసిన ఈ సమస్త సృష్టి ఎక్కువగా స్త్రీ శక్తిమీదనే ఆధారపడి ఉంది. ఆమె ప్రేమానురాగాలతోనే పురుషుడికి చల్లని సంసారం ఏర్పడుతోంది. సృష్టి అవిచ్ఛిన్నంగా ముందుకు సాగుతోంది. బిడ్డలకు జన్మనిచ్చే ప్రతి సందర్భంలోను స్త్రీ తన ప్రాణాలను పణంగా ఒడ్డుతుంది. పుట్టిన పిల్లలను కంటికి రెప్పలా కాపాడుతూ, మమతానురాగాలు పంచుతూ, పెంచి పెద్దచేస్తుంది. కన్నబిడ్డల అభివృద్ధికోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడుతుంది. తల్లి ఋణం తీర్చుకోలేనిది. ఒక కవి చెప్పినట్టుగా మనం "అమ్మకు అమ్మగా పుడితే కాని" ఆమె ఋణం తీరదు.

నిన్న మొన్నటి వరకూ మన సమాజంలో స్త్రీలకు సరియైన స్థానంలేదు. పురుషులకు షష్టిపూర్తి, సప్తతిపూర్తి, అశీతిపూర్తి, సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవం జరుపుతారు; కాని స్త్రీలకు ఏమీ చేయరు. స్త్రీలకు కూడా ఇవన్నీ జరిపి, వారిని గౌరవించాలి. (అయితే ఇక్కడ ఒక సమస్య వస్తోంది. సినీమా హీరోయిన్లే కాదు, మామూలు గృహిణులు కూడా తమ వయస్సు వెల్లడించడానికి ఏ మాత్రమూ ఇష్టపడరు. షష్టిపూర్తి అయినా, కొందరు మహిళలు తమ్ము తాము పన్నెండేళ్ళ బాలాకుమారిగానే భావించుకుంటూ ఉంటారు.)

25.04.2020 శనివారం నాటికి 60 వసంతాలు పూర్తిచేసుకున్న శ్రీమతి అంబికా అనంత్‌గారు నిండు నూరేండ్లు సుఖసంతోషాలతో, ఆయురారోగ్య సంపత్పరంపరాభివృద్ధితో ప్రశాంతంగా జీవించాలని ఆమెకూ నాకూ ఇష్టమైన శ్రీకృష్ణపరమాత్మను ప్రార్థిస్తున్నాను. నేను వ్రాసిన ఒక కవితతో నా ఆశీర్వచనం ముగిస్తున్నాను.



"హరికథాపితామహులు" ఆదిభట్ల నారాయణదాసుగారు ఒక పట్టణంలో (జిల్లా కేంద్రంలో) పార్వతీకల్యాణం హరికథ చెప్పబోతున్నారు. ఈ విషయం తెలిసి వారి హరికథ వినడంకోసం ఒక ఆంగ్లేయుడైన జిల్లాకలెక్టరు వచ్చాడు. అప్పుడు దాసుగారి శిష్యులు: "అయ్యా! గురువుగారూ! మీ హరికథ వినడంకోసం కలెక్టరు దొరగారు వచ్చారు. అందువల్ల కథాప్రారంభంలో మీరు శివునిగురించి ఇంగ్లీషులో ప్రార్థన చెయ్యండి!" అన్నారు. దాసుగారు వెంటనే "ఓ! దానికేముంది? అలాగే కానిద్దాం!" అని ఈశ్వరప్రార్థన ఈ క్రింది విధంగా ప్రారంభించారు:–

"హెడ్డునమూను, స్కిన్నుపయి నెంతయు డస్టును, ఫైరునేత్రమున్
సైడున గ్రేటుబుల్లు, బహుచక్కని గాంజెసు హైరులోపలన్,
బాడికి హాఫెయౌచు నల పార్వతి మౌంటెను డాటురుండ, ఐ
షుడ్డు డివోటు దండములు సోకగ ప్రేయరుసేతు నెప్పుడున్!"

సభంతా హర్షధ్వానాలు చేసింది! దొరగారు ఆశ్చర్యపోయారు!

**(–శ్రీ టి.వి.కె. సోమయాజులుగారి "ఏటినముత్యాలు" నుండి**

# "మల్లేశ్వరం మహారాణి"

1

కాదు మల్లేశ్వరస్వామి
కరుణా కటాక్ష వీక్షణ
సుధావర్షంతో అభిషిక్తమై
ఆద్యంతం పునీతమవుతోంది
18 అడ్డరోడ్ల పగడాల దండలతో
అలంకరింపబడ్డ ఈ మల్లేశ్వరం!
బెంగుళూరులో వెలసిన ఒక అగ్రహారం!
ఇక్కడ "సర్వం శివమయం జగత్"
ప్రతివస్తువూ
పరమేశ్వర కృపాపరివేష్టితం
శివంకరం శుభంకరం!
మహాశివరాత్రి పర్వదినాన–
స్వామివారు అమ్మవారితో కలిసి
తిరువీథుల్లో తన
శోభాయాత్రను కొనసాగిస్తాడు!
మధ్యలో అమ్మవారు
చటుక్కున మాయమవుతుంది...
అయ్యవారు
కంగారుగా దిగులుగా
దిక్కులన్నీ శోధిస్తాడు...
ఆత్రంగా అన్ని వీథులూ గాలిస్తాడు...
13వ క్రాస్‌లో 22వ నెంబరు ఇంటి దగ్గర
ఠక్కున ఆగిపోతాడు...
అనుమానంతో ఆ యింటిలోపలికి ప్రవేశిస్తాడు
అక్కడ తిష్ఠవేసికొని తపస్సు చేస్తాడు
ఆ యింటివారి పూజలు స్వీకరిస్తాడు
అప్పుడు ప్రత్యక్షమవుతుంది
చిరునవ్వులు చిందిస్తూ రుద్రాణి,
సాభిప్రాయంగా స్వామిని
క్రీగంటితో చూస్తూ శర్వాణి,
శ్రీ లలితాంబికా రూపంలో భవాని
శివశంకరుని రాణి!
ఆమె మల్లేశ్వరుని అంతర్వాణి
అలికులవేణి, గీర్వాణ శిరోమణి!

ఓహెూ! ఇలాగే ఈమెలాగే ఉండేవారు కాబోలు –
ద్వారకలో శ్రీకృష్ణుని రుక్మిణీదేవి, సత్యభామాదేవి!
కొండలలో నెలకొన్న కోనేటి రాయని శ్రీదేవి! భూదేవి!
ఇలాగే ఈమెలాగే ఉండేవారు కాబోలు –
అలనాటి రాయల దేవేరులు
తిరుమలదేవి – చిన్నాదేవి
మల్లెల మొల్లల నవ్వులతో...
మరువం దవనం మాటలతో...
తెల్లని కన్నుల చల్లని వెన్నెలతో...
నీలి మబ్బును చూచి ఉబ్బితబ్బిబ్బై
పురివిప్పి నర్తించే నెమలి హెుయలుతో...
ఆఫ్రికా అటవీ మధ్యంలో
గర్జించే మృగరాజఠీవితో
సౌజన్యంతో... సౌశీల్యంతో...
సౌభాగ్యంతో... సౌహార్దంతో...

సాహిత్యంతో... సాహిత్యంతో...
అన్నట్టు –
ఇన్ని మాటలెందుకు?
ఒక్క ముక్కలో చెప్పాలంటే –
ఈమె –
మల్లేశ్వర సాహిత్య రసజ్ఞ సామ్రాజ్యానికి
మకుటం లేని మహారాణి!
మా 'అనంతు'ని పట్టపురాణి!
కవితాకన్య కాళ్ళ పారాణి!!

## 2

పాతికేళ్ళ క్రితం
బాపురెడ్డిగారి ద్వారా
నాకు మీ మొదటి పరిచయం.
ఆ సమయాన మీరు
ఆత్మీయంగా బహూకరించిన
కంచు "ఓం" కారం
ఇప్పటికీ మా హాలులో
అందంగా అమరి ఉంది.
ఈ రోజు దానికి
మీ తీయని చెలిమి తలపులతో
పులికాపు పెడుతున్నాను...
నా మదిగదిలో
ఏకాంతధ్యానంలో
మీ భక్తి ప్రపత్తుల ఓంకారం
"శ్రీశ్రీ రవిశంకర్" ఆశ్రమంలో లాగ
ప్రశాంతంగా
ప్రతిధ్వనిస్తూనే ఉంది!
"శ్రీరస"కు మీరు
అభిమానంతో ఇచ్చిన
అందమైన **table cloth**
అంతకన్నా అందమైన **flower vase**
మన సాహిత్య సభల శోభను
ద్విగుణీకృతం చేస్తూనే ఉన్నాయి!

## 3

నాయందు
ప్రగాఢ భక్తి తాత్పర్యాలు కలిగిన
నాకు పుత్రికా సమానురాలైన
ఈ ఉత్తమ శిష్యురాలితో
నాకు –
ఒక్కటే ఒక్క విభేదం –
"అమ్మా!
మీరు
కృష్ణభక్తులుకావడం
నాకు
చెప్పలేనంత ఆనందం!
కాని
మీరు
'**Super Star** కృష్ణ' భక్తులుకూడా కావడం
నాకు –
భరింపరానంత
విషాదం!!"
ఒకవైపు ఆనందం
మరొకవైపు విషాదం
సుఖదుఖాలు
తప్పించుకోలేని ద్వంద్వాలు కదా!

ఏం చెయ్యను?
మౌనంగా తలదాలుస్తున్నాను..."

**4**

జీవితాన్ని పంచుకున్న పతికి -
రక్తాన్ని పంచుకున్న సుతులకు -
పుట్టింటి మెట్టింటి
ఆత్మబంధుతతికి -
అంతటా అలముకొన్న
ప్రియ వయస్య వితతికి -
కవిత్వ మాధురీ శీధు పిపాసువులకు -
అన్నివేళలా అలవోకగా లభించే
శ్రీలలితాంబికాదేవి అందదండలు -
'సంపిగె రస్తె' పూలబజారులో
సింగారంగా వ్రేలాడే
సిరిమల్లెల పూదండలు!
కనువిందుచేసే
నిలువెత్తు ఎర్రగులాబీదండలు!
నిరంతర మైత్రీ పరిమళాల కైదండలు!

"వణుకూరి"వారి యింట పుట్టిన
"పంద్రవాడ"వారి యింట మెట్టిన
అరవై వసంతాల అపరసరస్వతికి -
ఉభయభాషా కవయిత్రికి -
ఆంగ్లపత్రికా రచయిత్రికి -
నా మానసపుత్రికి -
"నారాయణీయం" గృహలక్ష్మికి -
నా కవితా "స్వర్ణకంకణం"!

"శతమానం భవతి శతాయుః పురుషః
శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి"
(ఆశీస్సుకు అర్థం:-
"మనిషి ఆయుర్దాయం వందేళ్ళు
నీవు వందేళ్ళు వుందువుగాక!
సమస్త ఇంద్రియాల
సంపూర్ణ ఆరోగ్యంతో
దీర్ఘాయువుతో
వందేళ్ళు
చక్కగా నివసించి
ఉందువుగాక!")

(ప్రసిద్ధ కవయిత్రి, రచయిత్రి శ్రీమతి అంబికా అనంత్‌గారి షష్టిపూర్తి సందర్భంగా, 25.04.2020నాడు బహూకరించిన కవిత)

- ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

**లఘుటిప్పణి:**

1.సౌజన్యం=సుజనత్వం, మంచితనం
2.సౌశీల్యం=సుశీలత్వం, మంచిగుణం
3.సౌభాగ్యం=సంపత్తు, సౌందర్యం
4.సౌహార్దం=స్నేహం
5.సౌహిత్యం=తృప్తి, తనివి
6. కవిత్వ మాధురీ శీధు పిపాసువులకు = కవిత్వమనే తీయని పూలతేనెను త్రాగాలని తహతహలాడేవారికి.



# కవితానీరాజనం - వివిధ కవులు

## మందారమాల

- ఆచార్య శలాక రఘునాథశర్మ

గోదారి పడమటిగాలుల పవిత్రతతో
మాధుర్యపరీమళాలతో పరవశించిపోయే
తణుకు ప్రాంతాల తళుకు ఒకటి
ఎక్కడెక్కడో విహారవిన్యాసాలు నిర్వహించి
బెంగుళూరు బెళుకుగా ఇప్పుడు తళతళలాడుతున్నది.
కావేరీ తుంగభద్రల స్వచ్ఛతనూ, తీయదనాన్నీ
అపఘనంలో అలకరించుకుంటున్నది.

తలపై నల్లవెంట్రుక నలుసంతైనా లేకపోయినా
నిలువెల్లా తారుణ్యం తొణికిసలాడే
కమనీయరూపం కన్నులకు విందుచేస్తుంది
సుందర దరహాస వీచికలు దోబూచులాడే ముఖారవిందం
అందరినీ హాయిగా పట్టి నిలుపుతుంది
గలగలా నవ్వినప్పటి సెలయేటి
మధురనాదాల గిలిగింతలు
ఎదలలో మువ్వల సవ్వడులను ముంచి యెత్తుతూ ఉంటాయి.

తెలుగు మాగాణంలో విరుగబండిన జానపదవిజ్ఞాన
సంపదను ఎదదపాతరలలో భద్రపరచుకొని
తెలుగుజాతికి ఆమెతలు పెట్టి ఆనందిస్తున్నది ఆతళుకు
తానేదో చెప్పాలనే తపన
దానిని మించి రసహృదయాల నుంచి
తానేదో ఆస్వాదించాలనే జ్ఞానదాహం
అచ్ఛమైన కవితాత్మ లందించే రసఝురులను
తెలుగుపొలాలకు మళ్ళించాలనే ఆరాటం
చైతన్యం ఊపిరిగా, కవిత్వం హృదయస్పందనగా
కదలుతున్న రసవాహిని
పదిమంది యింటికి రావాలనీ
ధర్మపత్ని ఆప్యాయంగా అమర్చి అందించే
రసోపేత భోజనాలను స్వీకరించి
గర్రున త్రేన్చుతూ కదలాడాలనీ
కాంక్షించే ఆతిథేయ సౌందర్యం.

వ్యవహారంలోనే కాదు అభ్యవహారంలో కూడా
ఏ మాత్రమూ మొగమాటం లేని నిజాయితీ
ఉన్నంతలో అక్షరార్చనను చేసి
రాయలవారినో రాజరాజనరేంద్రుణ్ణో
తలపింప చేయాలన్న ఆకాంక్ష.
ఇలా కాంతికిరణాలను వెల్లిగొలుపుతున్న
ఒక అద్భుత మందారమాల
మా "తంగిరాల"!!

(అపఘనం = శరీరం; అభ్యవహారం = ఆహారం)

## మా తంగిరాలవారు

- అంబికా అనంత్

కళ్ళనిండా చైతన్య (కవితా) రాగాలు
నవ్వులో చల్లని వెన్నెల కిరణాలు
వాక్కులో వాగ్దేవీ నాట్యాలు
హృదయంలో రససంపన్న తరంగాలు
వెరసి, మా తంగిరాలవారు!
ప్రాచీనమూ, ఆధునికమూ
రెంటికీ వారధి వారి సమన్వయభావం
కవితల మాలల్ని చేస్తారు చైతన్యద్వారతోరణాలు
'నెలనెలా వెన్నెల'లో వినిపిస్తారు నవ్యనాదస్వరాలు
అచేతన, అలుపు, అహంకారమనే మా మెదడు చీకట్లలో
వెలుతురుఉలితో కాంతికవితారూపాలు చెక్కుతారు
మమ్మల్ని ప్రాథమికదశనుండి ప్రజ్ఞాపాటవాలకు చేరుస్తారు

మా 'వ్యావహారికానికి' మెరుగులు దిద్ది కాంచనవాక్యాలు చేస్తారు

ఆయనలో అంతర్వాహినిగా సాగేసాహిత్యం
నింపుతుంది మాలో కవితామహత్వం
మాకు అందే అభినందనల అపూర్వ ఆనందం
మాలో ఆయన నింపిన ఉద్దీపనశక్తికి నిదర్శనం

మా శ్రీరసాధ్యక్షులు తంగిరాలవారికి
వేల వేల వెన్నెలకోళ్ళు....!!

# విద్వత్కవి - తంగిరాల

క్రోధములేని సాధువు, అకుంఠిత నైతికశీలశాలియున్
ఆధునికాంధ్రవాఙ్మయ మహార్ణవనౌక, కవిత్వమాధురీ
శీధుపిపాసి, మిత్రజనసింధు శరద్వర పౌర్ణమాసియున్,
సౌధములేని రాజునకు సాంద్ర సమస్సులు తంగిరాలకున్.

సాయంకాల శశాంకరేఖ, మధుమాసాయాత చూతాంకుర
చ్ఛాయాపాయి కిశోర కోకిలము, విశ్వాకాశ కోశాంతర
ప్రేయోవాయు సుపర్ణ బిందువు, వచఃపీయూష యోషిత్కృపా
శ్రేయోజన్ముని, 'తంగిరాల' సుఖునిం బ్రేమింతు, శేషేంద్రుడన్!

"యుగకవి" డా॥ గుంటూరు శేషేంద్రశర్మ

# మా సుబ్బన్నబావ

"మధురకవి"–"సరసకవి"–"సారకవితాభిరామ"–"కవి సుధాకర" – శ్రీదుగ్గిరాల రామారావుగారు తంగిరాలవారిని గురించి "మా సుబ్బన్నబావ" అనే పేరుతో 50 పద్యాలు వ్రాశారు. ఇవి "చైతన్యకవిత"లో మొదట ప్రచురితమయ్యాయి. తరువాత దుగ్గిరాలవారు ప్రకటించిన "సుమనోభిరామము" (2005) అనే పుస్తకంలో వచ్చాయి. వాటిలో నుండి మూడు పద్యాలు:–

చ.పలుకులదేవి సేవలను పండిన శీర్షము,దబ్బపండుతోఁ
గలఁబడుమేను, కాశసువికాసము వాసము మీసకట్టు, మ
ల్లెలు విరఁబూయు లేనగవు రేకలు, 'సుబ్బనబావ' పండువె
న్నెల దిగజారు మేరుధరణీధరశృంగముభంగిఁ గన్పడున్. 1

సీ. 'చైతన్యకవిత'కు సంపాదకుండు, స
ద్గ్రంథ సంతతికి ముద్రాపకుండు
అనుకూలురగు బిడ్డలనుగన్న జనకుండు,
ఖ్యాతిగన్నట్టి అధ్యాపకుండు,
వలచి చేకొను 'శకుంతల'కు దుష్యంతుండు,
పరిణతిఁగన్నట్టి పండితుండు,
'సోమయాజులు' కుఁ గూర్చు సహోదరుఁడు, తంగి
రాలాబ్ధి తరుణ సారంగధరుఁడు

తే. భావబంధుర మధుర సంభాషణుండు,
ముచ్చటం గొల్పు వినయ విభూషణుండు
జానపద సాహితీ విశేషముల తావు,
సుగుణముల ప్రోవు, వేంకటసుబ్బరావు! 2

సీ. అభ్యుదయ కవులం దధికుండు 'బాలగం
గాధర తిలకు' సంగాతకాఁడు,
అభినవ పెద్దన్న యనఁదగు 'గుంటూరు
శేషేంద్రశర్మ' మెచ్చిన బుధుండు,
'బుల్లా'కులాబ్ధి జాబిల్లి 'సుబ్బారావు'
ప్రాణమ్ము ప్రాణమైనట్టి సఖుఁడు,
'దళవాయి' పారిజాతమ్ము 'కృష్ణస్వామి
ఆదికేశవుల' వీరాభిమాని,

తే. దొర కవివరుఁడు 'మల్లెల గురవయ' కవి
విమల కృతికన్యఁ జేకొన్న పెండ్లికొడుకు,
ధన్యజీవి, మా 'ఆచార్య తంగిరాల'
వర్ధిలునుగాత నూరు సంవత్సరాలు! 3

– దుగ్గిరాల రామారావు

# హాస్యజ్యోతి - శ్రీరమణ

## ఆంధ్రకేసరి

ఒకసారి విశ్వనాథ సత్యనారాయణగారికి రాష్ట్ర సచివాలయంలో ఏదో పని కావలసి వచ్చింది. చాలా రోజులుగా ఆ వ్యవహారం తెమలక పోవడంతో ఏదో సందర్భంలో టంగుటూరి ప్రకాశంపంతులుగారిని కలిసినప్పుడు ఆ విషయం ప్రస్తావించారు. సచివాలయంలో వారికి కావలసిన పని ఎంతవరకు వచ్చిందో తెలుసుకోమని ప్రకాశంగారిని అడిగారు. అందుకు ప్రకాశంగారు కొంత విముఖత చెపుతూ – "ఈ సచివాలయం పెద్ద అడవి. దీనిలో పనులు అలాగే వుంటాయి" అన్నారు.

అందుకు విశ్వనాథ ఓ చిరునవ్వు నవ్వి "అందుకే కదండీ తమకు మనవి చేసుకున్నది. మీరు ఆంధ్రకేసరి కదా! ఈ అడవి మీ కొక లెఖ్ఖ కాదు" అన్నారు. ఆ మాట విన్నాక ఆంధ్రకేసరికి ఆ పని నెత్తిన వేసుకోక తప్పింది కాదు.

● ఒకసారి ముళ్ళపూడి వారికి డబ్బు కావల్సి ఒక ఆప్తమిత్రునికి ఫోన్ చేశారు. అప్పుడు వారిద్దరి మధ్య సాగిన సంభాషణ: "డబ్బు కావాలి..." – "ఎప్పటికి కావాలో చెప్పండి, పంపుతాను" – "మొన్నటికి...." మిత్రుడికి ఇంకేమి మాట్లాడాలో తోచలేదు.

● కాటూరి వారికి రాత్రి పడుకోబోయే ముందు చుట్టలు చుట్టుకోడం అలవాటు. అదేమన్నా అంటే 'ఆదిశేషుడు కూడా చుట్టలు చుట్టుకునే పడుకునేవాడు" అనేవారు.

## తిట్టు ఖరీదు రెండు రూపాయలు

ఆఫీసు ఎక్కౌంట్సు రాయడంలో నిష్ణాతుడైన శ్రీఅనుమకొండ సూర్యనారాయణ, సుప్రసిద్ధ చిత్రనిర్మాత, దర్శకుడు అయిన శ్రీ గూడవల్లి రామబ్రహ్మం వద్ద ప్రొడక్షన్ మేనేజరుగా చాలాకాలం పనిచేశారు. శ్రీ రామబ్రహ్మం యెంత విశాల హృదయుడో అంత కోపిష్ఠి కూడా. ప్రతి చిన్న విషయానికి ఆగ్రహపడి ఆఫీసులో అందర్నీ కసురుకునేవారు. వారి ఉదార స్వభావం అందరికీ తెలిసిందే కనుక యెవరూ అంతగా పట్టించుకునేవారు కాదు.

ఒక చిత్రం పూర్తి అయి విడుదల అయ్యాక ఆఫీసులో అందరికీ రిలీజ్ లెటర్లు యిచ్చారు. శ్రీ సూర్యనారాయణకు కూడా యిచ్చి, చిత్ర నిర్మాణపు లెక్కలన్నింటినీ అప్పజెప్ప మన్నారు. ఆ లెక్కల జాబితాలో "నన్ను తమరు ఈ చిత్ర నిర్మాణ సందర్భంలో 642 సార్లు తిట్టారు" అని చివరనరాశారు శ్రీ సూర్యనారాయణ. ఇది చూసిన శ్రీ గూడవల్లి తిట్టుకు రెండు రూపాయల వంతున లెఖ్ఖకట్టి 1284 రూపాయలను అందజేసి తన ఉదారస్వభావాన్ని ప్రదర్శించుకున్నారు.

'వంశవృక్షం' నిర్మాత బాపుగారితో ఆమాటా ఈమాటా మాట్లాడుతూ "ఇంతకుముందు మీరు ట్రాజెడీలు తీసినట్లులేదు అన్నారు. "అఫ్‌కోర్స్... తీశాక చాలా చిత్రాలు ట్రాజెడీలే అయ్యాయి" అన్నారు బాపు చిరునవ్వులోంచి.

● కాకనాడలో జరిగిన సన్మానసభలో ప్రసంగిస్తూ శ్రీశ్రీ – "నన్ను మొట్టమొదట అచ్చేసి దేశంమీదకు వదిలింది పురిపండా" అన్నారు. ఆయన మొదటి కావ్యం పబ్లిషర్ శ్రీ పురిపండా.

### జాయింటుమెంటు

ఆంధ్రదేశంలో కొప్పరపు కవులు, తిరుపతి వెంకట కవులు సాహితీ సామ్రాజ్యాన్ని పాలిస్తున్న రోజులలో జంటకవులుగా చెలామణి కావాలని చాలామంది ఉత్సాహ పడ్డారు. విశ్వనాథవారు – కొడాలి ఆంజనేయులుగారితో కలసి జంటకవిత్వం చెప్పారు. విశ్వనాథవారి తండ్రి పేరు శోభనాద్రి. కొడాలివారి తండ్రిపేరు వెంకటాచలం. ఇద్దరి తండ్రుల పేర్లలోనూ గిరులున్నవి కనుక వారిరువురు "గిరికుమారులు" అని కలం పేర్లతో కలసి కవిత్వం చెప్పారు. ఆ రోజులలోనే దీపాల పిచ్చయ్యశాస్త్రి, గుర్రం జాషువా కూడా జంటకవులుగా రూపొంది రచనలు చెయ్యాలని ఉబలాటపడ్డారు. ఇద్దరికీ కలసి వచ్చేపేరు నిర్ధారణ చెయ్యడానికి ఒక రోజు సమావేశమైనారు. పైన చెప్పిన జంటకవులుగా ఇమిడిపోయే పేరు వీరికి దొరకలేదు! "పిచ్చి జాషువా" లేదా "జాషువా పిచ్చి" అని పెట్టుకోవాల్సి వచ్చిందట. అందుకని వారు ఆ ప్రయత్నాన్ని విరమించుకుని విడివిడిగా ప్రతిష్ఠ నార్జించారు. వారికే కనుక

పేరు కుదిరివుంటే ఆ జంట మరో గొప్ప కావ్యాన్ని తెలుగు మాగాణంలో పండించి వుండేదేమో?

## నిజలింగప్పకు అనారోగ్యం

తన చిత్రానికి పాటరాసి ఇవ్వమని అడిగిన చాలా రోజులకు ఆ నిర్మాత కృష్ణశాస్త్రిగారిని దర్శించి పాటమాట జ్ఞాపకం చేశాడు. దానికి జవాబుగా దేవులపల్లివారు కాయితం మీద 'నిజలింగప్పకు అనారోగ్యం' అని రాసి చూపారు. నిర్మాతకు ఏమీ బోధపడలేదు. ఎక్కడో బెంగుళూరులో వున్న నిజలింగప్పకు అనారోగ్యమైతే శాస్త్రిగారు పాటరాయక పోవడమేమిటో అసలే అర్థం కాలేదు.

ఇక శాస్త్రిగారికి బదులు చెప్పడానికి ఎదురు ప్రశ్న వేయడానికి సంకోచించిన నిర్మాత తర్వాత మళ్ళీ కలుద్దామని తిరిగి వచ్చేశారు. మాటల సందర్భంలో ఆ నిర్మాత ఈ సంగతి శ్రీశ్రీతో అంటే ఆయన భాష్యం చెప్పాట్ట! నిజలింగప్ప అంటే ఆత్మారాముడని, అనారోగ్యం శాస్త్రిగారికేనని. ఒక క్షణం ఆలోచించి 'ఓహో' అనుకున్నాడు నిర్మాత అర్థం చేసుకుని.

## అగ్రస్థానం సమయస్ఫూర్తి

ఒకసారి అనకాపల్లిలో కృష్ణతులాభారం నాటకం ప్రదర్శిస్తున్నారు. స్థానం నరసింహారావు సత్యభామగానూ, కె. గోవిందరావు రుక్మిణిగానూ నటిస్తున్నారు. చివరి రంగంలో కృష్ణుణ్ణి రుక్మిణి తులసిదళంతో తూస్తుంది. రుక్మిణి తులసిదళం పుచ్చుకుని భక్తిభావంతో –

ఆ.వె. "ఫలమొ, ఘనరసంబొ పత్రమో పుష్పమో
గొనుచు భక్తి నిన్ను గొలుచువారి
కీవు వశుడవగుటయే సత్యమేని, ఈ
తులసిదళము నిన్ను తూచుగాక!"

అని పద్యం చదువుతూ త్రాసులో వుంచింది. కాని సాంకేతిక లోపంవల్ల అనుకున్న ప్రకారం కృష్ణుడు కూర్చున్న సిబ్బె పైకి లేవలేదు. స్టేజిమీదున్న వారందరికీ నిలువుగుడ్లు పడ్డాయి. జనం గొల్లుమన్నారు. అప్పుడు స్థానంవారు "అక్కా! భర్తకు యిలాంటి స్థితి పట్టినది గదా అన్న ఆవేదనలో నీ ధ్యానము నిలకడ తప్పినట్లున్నది. మరల మనస్సును లగ్నము చేసుకుని తులసిదళము వుంచుము" అన్నారు.

రుక్మిణి మరల "ఫలమొ, ఘనరసంబొ"... అంటూ మరల దళం వుంచింది. కాని యీసారి పద్యం పూర్తికాకముందే కృష్ణుడు పైకి లేచాడు. జనంలోంచి మళ్ళీ నవ్వులు! "అక్కా! నీ భక్తి మధ్యలోనే పరాకాష్ఠనందుకున్నది చూచితివా?" అని రెండవసారి స్థానంవారు సమర్థించి ప్రేక్షకుల నోటికి తాళం వేశారు.

## చెళ్ళపిళ్ళ చెణుకులు

ఆంధ్ర నాటక కళాపరిషత్తు పక్షాన 1948లో శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి విజయవాడలో సన్మానంజరిగింది. అప్పుడు వారు ఆస్థానకవి కూడా! వారు విజయవాడలోనే నివాసం ఉంటున్నారు. సన్మానసభ అయిపోయిన తర్వాత చెళ్ళపిళ్ళవారి శిష్యప్రశిష్యులంతా వారితో కలసి గ్రూప్ ఫోటో తీయించుకోవాలని ఉబలాట పడ్డారు. శాస్త్రిగారు అప్పటికి లేచి నడిచే స్థితిలో లేరు. మెల్లగా వారిని కుర్చీలో కూర్చోబెట్టి ఇంట్లోంచి బయటకు తీసుకువచ్చారు. చుట్టుప్రక్కల జనం చాలామంది పోగయ్యారు. "పాపం...! ఎప్పుడు...?" అన్నారు కొందరు విచారం వ్యక్తంచేస్తూ.

"లేదు, లేదు, మేం ఫోటో తీయించుకుంటున్నాం" అని శిష్యులు వారికి చెప్పి పంపించివేశారు. ఫోటో తీశాక శాస్త్రిగారి కుర్చీని పల్లకిలాగా మోసుకుని లోపలికి వెళ్తుంటే "ఫర్వాలేదు, నేను పోయానని తెలిస్తే ఒక వందమంది వస్తారు" అన్నారట ముసిముసిగా నవ్వుతూ.

## హంపీ శిథిలాలు!

బళ్ళారి రాఘవగారి అభినందన సభకు శ్రీశ్రీ, శివశంకర శాస్త్రి, దేవులపల్లి యిత్యాదులు వెళ్ళారు. రాఘవాచార్యుల గారింట్లోనే వీరందరికీ ఆతిథ్యం. అప్పటికి రాఘవగారు వయోవృద్ధులైపోయారు. నాలుగైదు రోజులు వీరంతా సరదాగా వారితో కాలక్షేపం చేశారు. తిరుగు ప్రయాణానికి వీరు సిద్ధం అవుతుంటే "ఈ దగ్గర్లోనే హంపీ వుంది. అక్కడ శిథిలాలు చూచి పోదురుగాని" అన్నారు రాఘవ.

వెంటనే శ్రీశ్రీ "మిమ్మల్ని చూస్తున్నాంగా..." అన్నారు. రాఘవగారితో సహా అంతా నవ్వారు.



క్రీ.శ.1520లో పోర్చుగీసు చిత్రకారుడు
వేసిన రాయలవారి వర్ణచిత్రం



శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణువు దేవాలయంలో
శ్రీకృష్ణదేవరాయల కాంస్య విగ్రహం (ఆధునికం)

## I. "శ్రీరస" కార్యవర్గం



'శ్రీరస' వ్యవస్థాపకులు:
డా॥ రాజేశ్వరి–ప్రొ॥ తంగిరాల–శ్రీమతి అంబిక



'శ్రీరస' మొట్టమొదటి సమావేశం
(11–4–1994, భావ ఉగాది)
ముఖ్య అతిథి శ్రీ పఠాభిగారు



‘శ్రీరస’ వ్యవస్థాపక అధ్యక్షులు
ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు



ఉపాధ్యక్షులు–1:
ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణకవిగారు



ఉపాధ్యక్షులు–2: శ్రీ పి. కృష్ణంరాజుగారు



కార్యదర్శి: శ్రీ పి.వి. రాధాకృష్ణగారు



మహిళా కార్యదర్శి-2
డా॥ టి.ఆర్. మీనలోచనగారు



మహిళా కార్యదర్శి-1: శ్రీమతి మారుతి శ్రీలతగారు



'శ్రీరస' కార్యవర్గం



కోశాధికారి:
శ్రీ నారపరాజు సుబ్బారావుగారు




'శ్రీరస' ట్రస్టుబోర్డు (రి.) (19-11-2018)

## II. “శ్రీరస” మహారాజపోషకులు



'దానరాధేయ':
శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు



శ్రీనారపరాజు సూర్యనారాయణగారు



డా. సి. సుబ్బలక్ష్మిగారు



శ్రీ తెలిదేవర సుబ్బారావుగారు



'శ్రీరస'కు ఆర్థికంగా, హార్దికంగా ఎంతో సేవచేసిన దంపతులు
కీ.శే.ప్రొ॥ డి. హెచ్.శాస్త్రిగారు–కీ.శే. ఎ. పాపగారు




'చైతన్యకవిత'ను ఆవిష్కరిస్తున్న ప్రముఖ కవి 'పఠాభి'గారు

## III. 'శ్రీరస'లో ప్రసంగించిన ప్రముఖులు



'యుగకవి'
డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారు



'శ్రీరస' సభ్యులతో చర్చిస్తున్న శేషేంద్రశర్మగారు,
హొటల్ అశోకా




'జాషువా జయంతి సభలో డా॥ రావూరి భరద్వాజగారు
(జ్ఞానపీఠబహుమతి గ్రహీత)



'అరసం' బెంగుళూరు శాఖ అధ్యక్షులు
శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు



'దానరాధేయ'
శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు



శ్రీ బుల్లా సుబ్బారావుగారు, ఐ.ఏ.ఎస్.



డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారు



"మహాసహస్రావధాని"
డా॥ గరికిపాటి నరసింహారావుగారు



"మహాసహస్రావధాని"
డా॥ గరికిపాటి నరసింహారావుగారు



శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు
(2001 నుండి ఈనాటివరకు)



శ్రీ మల్లాప్రగడవారితో ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు



శ్రీ మల్లాప్రగడవారు – శ్రోతలు



"యుగళ సహస్రావధాని" శ్రీ కోట లక్ష్మీనరసింహంగారు




"త్రిభాషా మహాసహస్రావధాని" శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు



“శతావధాని” – బహుభాషావేత్త
డా॥ ఆర్ గణేష్‌గారు



ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానందగారు






డా॥ అద్దేపల్లి రామమోహనరావుగారు






పాలగుమ్మి పద్మరాజుగారి
శతజయంతి సభ 07-09-2014,
పద్మరాజుగారి పుత్రిక ప్రసంగం



బుచ్చిబాబుగారి శతజయంతి సభ
(14-06-2015)



బుచ్చిబాబుగారు, తాను వేసిన వర్ణచిత్రాలను
శ్రీ సకలావారికి బహూకరిస్తున్న శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారు





బుచ్చిబాబుగారి శతజయంతి సభలో ప్రసంగిస్తున్న
ప్రముఖ చలనచిత్రనటి శ్రీమతి షావుకారు జానకిగారు





శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారు -
శ్రీమతి షావుకారు జానకిగారు




బుచ్చిబాబుగారి “చివరకు మిగిలేది” నవలనుగూర్చి
ప్రసంగిస్తున్న ఆచార్య కాత్యాయనీ విద్మహేగారు



ఆచార్య ఆర్వీయస్ సుందరంగారు



**అశీతిపూర్తి (80 ఏండ్లు) సభలో**
**ఆచార్య తంగిరాలవారి ప్రసంగం**
**(30-03-2015)**



సహస్రపూర్ణచంద్ర దర్శనోత్సవసభలో
ఆచార్య తంగిరాలవారి ప్రసంగం



డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు



శ్రీమతి అంబికా అనంత్‌గారు




ఆచార్య తంగిరాలవారి సప్తతిపూర్తి సభలో
డా॥ ఎ. రాధాకృష్ణరాజుగారి ప్రసంగం, **30-03-2005**





డా॥ హరి పవన్‌కుమార్‌గారు



మహిళామణుల అష్టావధానం - అభినందనలు



డా॥ గరికిపాటి నరసింహారావుగారి అష్టావధానం తరువాత
డా॥ గరికపాటి - ప్రొ॥ తంగిరాల-శ్రీమల్లాప్రగడ




బెంగుళూరు విశ్వవిద్యాలయం, సెంట్రల్ కాలేజి, సెనేట్ హాల్‌లో
ఉగాది సాహిత్య వసంతం, ఆచార్య తంగిరాలవారి ఆహ్వానం
ముఖ్యఅతిథి డా॥ ఆవంత్స సోమసుందర్‌గారు



రాజమహేంద్రవర మహిళామణుల అష్టావధానం,
చోక్సీహాలు, భారతీయ విజ్ఞాన సంస్థ

## IV. 'శ్రీరస' శ్రోతలు



గాంధీ సాహిత్య సంఘం, మల్లేశ్వరం, 2005



గాంధీ సాహిత్య సంఘం, మల్లేశ్వరం, 2005



మహిళామణులు, గాంధీ సాహిత్య సంఘం, 2005



శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరి గుడి, మల్లేశ్వరం, 2007



బుచ్చిబాబుగారి శతజయంతి సభ, I.I.Sc., L-1, 14-06-2015



భారతీయ విజ్ఞాన సంస్థ, చోక్సీహాల్, 2013



భారతీయ విజ్ఞాన సంస్థ, L-1



భారతీయ విజ్ఞాన సంస్థ, చోక్సీహాల్, 2013




భారతీయ విజ్ఞాన సంస్థ, ప్రధాన భవనం ఎదుట
'శ్రీరస' సభ్యులు, 2016



భారతీయ విజ్ఞాన సంస్థ, L-1



శ్రీ వరసిద్ధి వినాయక స్వామి దేవాలయం, 2017




భారతీయ విజ్ఞాన సంస్థ, ప్రధాన భవనం ఎదుట 'శ్రీరస' సభ్యులు, 2016



శ్రీ వరసిద్ధి వినాయక స్వామి దేవాలయం, 2018



'శ్రీరస' త్రీతలల్ మహోత్సవములు, 2018

## V. "శ్రీరస" సత్కారాలు

### (ఎ) గాంధీ సాహిత్య సంఘంలో



శ్రీపడమర్తి ఉమారాజేశ్వరరావుగారి అశీతిపూర్తి, 2003



ప్రముఖ కవి డా॥ అవంత్స సోమసుందర్ గారికి
శ్రీ పడమర్తివారి సన్మానం



శ్రీమతి అంబికా అనంత్‌గారికి -
డా. సోమసుందర్‌గారిచే సత్కారం



ఆచార్య తంగిరాలవారి సప్తతిపూర్తి, శ్రీపంతులుగారు,
డా॥ ఎ.రాధాకృష్ణరాజుగారల అభినందన (30-03-2005)



ప్రముఖ రచయిత్రి,
అనువాదకురాలు
శ్రీమతి అరిపిరాల సువర్ణగారి
అభినందన



ఆచార్య తంగిరాల దంపతులకు సత్కారం




డా॥ వైలవరపు శ్రీనివాసరావుగారికి శ్రీ సకలావారిచే సత్కారం




ఆచార్య రత్నాకరం శంకరనారాయణరాజుగారికి
**89వ జన్మదిన సత్కారం, 15-11-2008**




"మహాసహస్రావధాని" డా॥ గరికిపాటి నరసింహారావుగారికి
ప్రొ॥ రత్నాకరం శంకరనారాయణరాజుగారిచే సన్మానం




డా॥ వైలవరపు శ్రీనివాసరావుగారికి శ్రీ సకలావారిచే సత్కారం




ఆచార్య కాత్యాయనీ విద్మహేగారికి –
శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారిచే సత్కారం



శ్రీ దర్శి లక్ష్మీ వేంకటేశ్వర వరప్రసాదరావు పంతులుగారి ప్రార్థన

**(బి) భారతీయ విజ్ఞాన సంస్థలో ...**



"త్రిభాషా మహాసహస్రావధాని" శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారికి
శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డిగారిచే సత్కారం




శ్రీ మల్లాప్రగడవారికి శ్రీమతి అంబిక–శ్రీఅనంత్ దంపతులచే సన్మానం



పాలగుమ్మి పద్మరాజుగారి శతజయంతి,
ప్రొ॥ కవనశర్మగారికి సన్మానం (07-09-2014)



బుచ్చిబాబుగారి శతజయంతి,
శ్రీ అంపశయ్య నవీన్‌గారికి సన్మానం (14-06-2015)



శ్రీ మల్లాప్రగడవారిని సత్కరించిన ప్రొ॥ తంగిరాల రామశర్మ దంపతులు



ఆచార్య తంగిరాలవారి అశీతిపూర్తి (80 వసంతాల పూర్తి) - శ్రీ పెద్ది సత్యనారాయణగారి సత్కారం (30-03-2015)



ఆచార్య తంగిరాలవారి సహస్రపూర్ణ చంద్ర
దర్శనోత్సవసభ–శ్రీ సకలావారి సన్మానం



ఆచార్య తంగిరాలవారి "సహస్రపూర్ణ చంద్ర
దర్శనోత్సవసభ" సన్మానించిన శ్రీ కె. గంగరాజుగారు,
శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డిగారు (27-03-2016)



ప్రముఖ రచయిత్రి శ్రీమతి శివరాజు
సుబ్బలక్ష్మిగారికి సత్కారం



'శ్రీరస' వ్యవస్థాపక కార్యదర్శి
డా॥ దివాకర్ల రాజేశ్వరిగారికి సన్మానం



'శ్రీరస' వ్యవస్థాపక కార్యదర్శి
శ్రీమతి అంబికా అనంత్‌గారికి సత్కారం



ఆచార్య శలాక రఘునాథశర్మగారికి సత్కారం



శ్రీ మల్లాప్రగడవారికి
ప్రొ॥ తంగిరాలవారిచే "భారతభారతి"
బిరుద ప్రదానం



శ్రీ మల్లాప్రగడవారికి
శ్రీ పి. కృష్ణంరాజుగారిచే సన్మానం



డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారికి సత్కారం



ఆచార్య లింగమనేని బసవ శంకరరావుగారికి సన్మానం



కీ.శే. తంగిరాల శకుంతలాదేవి జయంతి – శ్రీమల్లాప్రగడవారికి సత్కారం



శ్రీమతి సత్యభారతి–
ప్రొ॥ జి.మోహనరావు దంపతులచే
శ్రీ మల్లాప్రగడవారికి సన్మానం



శ్రీమతి మంజూష - డా॥ హరి వసంత్ కుమార్ దంపతులకు
ప్రొ॥ జి. మోహనరావుగారిచే సత్కారం



డా॥ ఎ. శేషాద్రి శ్రీమన్నారాయణగారిచే సన్మానం

(సి) శ్రీవరసిద్ధి వినాయకస్వామివారి దేవాలయంలో...



డా॥ జి.వి. ఆర్. యశస్వి 'శ్రీరస' సత్కారం



శ్రీ సుబ్రహ్మణ్యంగారి సత్కారమును శ్రీమతి నాగమణి కామేశ్వరి -
శ్రీ ఆ.వి.జె. శ్రీరామ్ దంపతులు



మహారాజపోషకులు శ్రీతెలిదేవర సుబ్బారావుగారికి 'శ్రీరస' సత్కారం



శ్రీ మల్లాప్రగడవారిని సన్మానిస్తున్న శ్రీమతి కె.యస్.మనోరమగారు



రాజపోషకులు శ్రీమతి చక్రావధానుల పద్మ – శ్రీలంక చంద్రశేఖరం దంపతులకు 'శ్రీరస' సన్మానం



మహారాజపోషకులు శ్రీమతి పర్వతవర్ధని – శ్రీ నారపరాజు సూర్యనారాయణ దంపతులకు 'శ్రీరస' సన్మానం



తెలుగు విజ్ఞాన సమితి అధ్యక్షులు
డా॥ ఎ. రాధాకృష్ణరాజుగారికి
'శ్రీరస' సత్కారం



తెలుగు విజ్ఞాన సమితి
ఉపాధ్యక్షులు
శ్రీ కె. గంగరాజుగారికి
'శ్రీరస' సన్మానం



తెలుగు విజ్ఞాన సమితి
పూర్వకార్యదర్శి శ్రీ ఎ.కె.
జయచంద్రారెడ్డిగారికి
'శ్రీరస' సత్కారం



# MACHINEWELL INDUSTRIES




No. 9, 1st Main Road, (V.P.Road) Sharadambhanagar, Jalahalli Post
Bengaluru - 560 013 Phone: 23459380/81/82/83, Fax:23459384
E-mail: contact@machinewell.in Website: machinewell.in

---

**Naraparaju Suryanarayana**
**Managing Partner**
**Mobile: 9845054578**

**B. Basappa**
**Partner**
**Mobile:9243122274**

# MACHINEWELL INDUSTRIES

**No. 1st Main Road, (V.P.Road)**
**Sharadambhanagar, Jalahalli Post**
**Bengaluru - 560 013**

**Phone No: 080-23459380/81/82/83**
**Fax No:080-23459384**

**(SPECIALISTS IN WELDING: COPPER, ALUMINIUM & STAINLESS STEEL MACHINISTS AND MFRS. OF: PRECISION MACHINED COMPONENTS WITH CNC MACHINING FACILITIES CMM INSPECTION AVAILABLE)**